# అల్లాహో

[ కథలు ]

మునిమాణిక్యం
నరసింహారావు



దేశి కవితా మండలి
విజయవాడ - 2

ఈ సంపుటిలో :

# ఉపోద్ఘాతము

"దారి పొడుగునా, గుండె నెత్తురులు
తర్పణచేస్తూ పదండి ముందుకు

అంటాడు శ్రీ. శ్రీ. ఆయన సందేశం అది! మీరేమంటారు?"
అని నన్ను ఒకరు అడిగారు.

నేను ఎక్కడికీ పొమ్మనను. ఇంట్లోనే ఉండమంటాను. ఒకవేళ ఏదైనా పనిమీద, ఎక్కడికైనా వెళ్ళినా సాయం త్రానికి ఇంటికివచ్చి, ఆవిడ ఇచ్చిన కాఫీ పుచ్చుకొని పిల్లలతో, హాయిగా ఆడుకొంటూ కాలం గడపమంటాను.

"ఘోషలు వినపడుతున్నయి
గుండెలు విడిపోతున్నయి" అంటాడు కవి.

"ఇంకిన, తెగిపోయిన, మరణించిన, కొత్త నెత్తురు, విపంచికలు, యువయోధులు" కనపడ్డవి ఆ కవికి.

శ్రీ. శ్రీ. ఆకలేసి నక్షత్రాలు అదరిచూసే కేకలేశాడు అని అంటాడు, ఆ ఋషిపుంగవుని కావ్యాలకు కారికలు వ్రాసిన చలం.

నాకు అవేవీ వినిపించనూ లేదు, కనుపించనూ లేదు, ఆకలి వేయనూ లేదు. అందుకని ఈపుస్తకంలో ఆకలి బాధను గురించి, లోకంలో జరిగే అన్యాయాలను గురించి ఏమీ ఉండదు.

నెత్తురువాగులూ, ఆకలి ఏడ్పులూ నాకు కనిపించవు. వినిపించవు.

II

ఏదో కలో అంబలో త్రాగి ప్రతివాడూ, తృప్తి తోనూ ఆనందకతోనూ హాయిగా జీవిస్తున్నట్లు తోస్తుంది నా మనస్సుకు.

జీవితంలో సుఖదుఃఖాలు ఈనాడు క్రొత్తగా రాలేదు. కష్టసుఖాలూ, ఎప్పుడూ ఉన్న వే. ఏడ్చి ఏమిలాభం?

ఎత్తు అయిన పర్వతాలూ, లోతు అయిన లోయలూ భూమిమీద ఉన్నవి.

పర్వతాలను త్రవ్విపారేసి, గుంటలుపూడ్చి అంతా సమభూమి చేయాలని ఎంతపెద్దగా అరచినా, ఏమీ ప్రయో జనం లేదు.

లభించిన ఆనందంతో తృప్తిపడదామని నేనంటాను. కుళ్ళిన ఎముకలనూ, గడ్డకట్టిన రక్తాన్నిచూచి ఏడ్చి ఏం లాభం!

నేనుమటుకు అవిచూడను. జీవితంలో తృప్తీ ఆనం దమూ ఉంటే ఈ ఏడ్పులు తగ్గిపోవూ?

గుడిసెలముందు ఆరుబైట కటికనేలపై పడుకొన్న కోయదొరసాని భర్తతో సరసమాడుతున్నది. అదిచూడ రాదూ!

కార్మికుని సతి, భర్తను సమీపించి భర్తృముఖావ లోకనం వలన తనలో పొంగుతున్న ఆనందాన్ని అణచుకో లేక తట్టతీసుకొని, అతనిపై విసరి కిలకిల నవ్వుతున్నది. ఆ దృశ్యముచూచి ఆనందించరాదూ!

ప్రొద్దుగూకులూ చేలల్లో పనిచేసి, సాయంత్రానికి ఇళ్ళకు వస్తున్నారు కొందరు వనితలు. వాళ్ళు రంగురంగుల చీరలు కట్టుకొని, నవ్వుతూ పేలుతూ, ఒకరిపై ఒకరు పడుతూ, వయ్యారపు నడకలు నడుస్తున్నారు. వదినా మరదళ్ళమధ్య, అత్తాకోడళ్ళమధ్య, జరిగే సరసాభిరామమైన హాస్యాలు, పలుకులు, జీవితానికి అంతా ఆనందాన్ని ఇయ్యగలవిగా ఉన్నవి. అవి వినరాదూ!

ఇటువంటి దృశ్యాలు చూచి బ్రతకడానికి కావలసిన ధైర్యాన్ని సంపాదించుకొందాం. మిగతాదంతా ఏడ్పేగా! అదీ నేను అనడము.

జీవితానికి తృప్తి, ఆనందమూ దేనివలన కలుగుతున్నదో ఆ విషయాన్నే కావ్యవస్తువుగా తీసికొందాము అని నేను అంటాను.

అదీగాక ఏదిచెప్పినా రమ్యరీతిని చెపితే అది కావ్యం అవుతుంది. కాబట్టి నేను తీసికొనిన సంసారిక జీవితము కావ్య వస్తువు కానేరదు అని అనవలసిన పనిలేదు అనికూడా నేను అంటున్నాను.

ఈ పుస్తకంపేరును గురించి రెండు మాటలు వ్రాసి ఈ పీఠిక ముగిస్తాను. దీనికి 'అల్లుళ్ళు' అని పేరుపెట్టాను. ఇతర కథలుకూడా ఇందులో ఉన్నవి.

పెళ్ళిళ్ళలో అల్లుళ్ళకని ఏర్పరచిన బంతిలో అల్లుళ్ళే కూర్చొరు. ఆప్తస్నేహితులూ, బంధుగులూ కూడా కూర్చుంటూరు.

మొదట మా అల్లుళ్ళబంతికి సుందరమ్మ అల్లుడూ, మంగమ్మ అల్లుడూ, మా అల్లుడూ వచ్చారు.

తరువాత నేనువస్తే, 'కూర్చోండి మామగారూ' అని ముందుపీట నాకేయిచ్చారు.

నాతరువాత అన్నగారువచ్చారు. వారు నా ప్రక్కనే కూర్చున్నారు. కాంతయ్యగారూ, డాక్టరుగారూ మా అన్నగారికి ఆప్తమిత్రులు. వారొచ్చి అన్నగారి సరసనే కూర్చున్నారు.

ఇంతలో టెన్నిస్ బాటు పట్టుకొని ప్రసాద్ వచ్చాడు. 'కూర్చోవోయ్' అన్నాము. ఆయనా కూర్చున్నాడు.

ఇల్లాగ ఈ అల్లుళ్ళపంక్తి ఏర్పడ్డది.

ఈ కథలవరస ఇల్లాగ ఏర్పడటాన్ని గురించిన చరిత్ర ఇది.

కథలు చదివేపద్ధతిని గురించి ఒక్కమాట. శిష్టప్రశ్న ముందుగా చదవండి. దానితరువాత మీ ఇష్టంవచ్చినవరుసలో కథలన్నీ చదవండి.

ఈ కథల విషయమై మీ అభిప్రాయం గ్రంథకర్తకు ఒక్కముక్క వ్రాస్తే చాలా సంతోషిస్తాను.

మునిమాణిక్యం

# గృహ పరిపాలన

నిత్యజీవితంలో ఇల్లాలు చూచే విషయాలు ఒకరకం; ఇంటాయన చూచే విషయాలు మరొకరకమూ అన్న సంగతి అందరికీ తెలిసినదే.

ఈ గృహరాజ్య పరిపాలనకు సంబంధించిన విషయాలలో కొన్ని యిల్లాలు పరంగానూ మరికొన్ని ఇంటాయన పరంగానూ వుంటూ వుంటవి. అదొక విధమైన ద్వంద్వ పరిపాలన.

పనివాళ్ళను నియమించటమూ, వాళ్ళచేత పనులు చేయించుకోవడమూ; బియ్యం, ఉప్పు పప్పు మొదలైన వస్తువులను తెప్పించుకొని వాడుకొనడమూ, దగ్గరలోనున్న చిలకలపూడి, చింతగుంటపాలెం, శివగంగ ఇత్యాది పుణ్యక్షేత్రాలకు వెళ్ళిరావటమూ, పిల్లలను సినిమాకు పంపటమూ, వాళ్ళకు పండుగలకు బట్టలు కుట్టించటమూ, అల్లుళ్ళను పండుగలకు పిలిపించటమూ, వారిని ఉచితరీతిని సత్కరించటమూ, కూతుళ్ళను పురుళ్ళకూ, పుణ్యాలకూ తీసికొనిరావటమూ, మనవలకూ, మనుమరాండ్రకూ బట్టలు కుట్టించి ముద్దు ముచ్చటలు తీర్చటమూ మొదలైన విషయములు పూర్తిగా ఆవిడ అధీనమై వుంటూవున్నవి. ఇవి ట్రాన్స్‌ఫర్డు సబ్‌జక్ట్సు. ఈ సబ్‌జక్ట్సుకు సంబంధించిన పరిపాలన అంతా ఆమె జరుపుతూ వుంటుంది.

ఇల్లాలి ప్రభుత్వం ఒకవిధంగా నిరంకుశమే అని చెప్పాలి. కాని ప్రజాహితమైనది. నోరులేని ప్రజలకు ఏదికావాలో

అది సమకూరుస్తూ వుంటుంది. వాళ్ళ విశ్వాసమునూ, ప్రేమనూ ఆమె చూరగొంటుంది. అది ఆమె నిత్యజీవితము. పైనజెప్పిన విషయాలకు సంబంధించిన పరిపాలనను సమర్థతతో నిర్వహించటమే ఆమె లక్ష్యము.

ఇంటావిడ విషయాలు యివా, యిక అవిపోను, మిగిలిన విషయాలు యింటాయనవి. అంటే అవి రిజర్వ్డు సబ్ జక్ట్సు అన్నమాట. పిల్లలకు పాఠాలు చెప్పటమూ, పసిపిల్లలు ఏడిస్తే బుజాన వేసుకొని ఆడించటమూ, పిల్లలకూ, యింటావిడకూ పక్కలు వేయటమూ, ఆవిడవైపు బంధువులకు తరుచూ క్షేమసమాచారం తెలుపుతూ ఉత్తరాలు. వ్రాస్తూ వుండటమూ, రేషన్ బియ్యం తేవడమూ, పంచదార తేవడమూ మొదలైనవి యింటాయన ఆధీనంలో వుంటూ ఉంటవి.

అసలు నిజంమాటకొస్తే రిజర్వ్డు సబ్ జక్ట్సు అంటూ ప్రత్యేకంగా ఏమీలేవు. ఆమెగారి ఆధీనమైయున్న సబ్ జక్ట్సు పోను మిగిలినవన్నీ గృహయజమానికి మిగులుతయ్యి. రాజ్యాంగతత్వ శాస్త్రంలో వీనికి రిసిడ్యుయరీ పవర్సు అని పేరు.

ఇల్లాంటి గృహపరిపాలనా విధానము, కొద్ది మార్పులతో, అన్ని ఇళ్ళల్లోనూ వుంటూవున్నదని మా విశ్వాసం.

ఇంటావిడ అధీనంలోవున్న యీ విషయాలకు కావలసిన డబ్బు యజమాని తన ఆదాయంలోనుంచి విడిగా తీసి యివ్వవలెను. ఆమె కోరిన డబ్బు యివ్వవలసిందేగాని

కొన్ని ఖర్చులు తగ్గించుకోవలసిందని ఆమెను కోరటానికి యజమానికి ఎల్లాంటి అధికారమూ లేదు.

ఆదాయ వ్యయ పట్టికను తయారుచేయు పని ఇల్లాలుదేగాని ఇంటాయనది కాదు. వసీబిల్సు అన్నీ వంటయింట్లోనే వ్రాసయి యజమానికి వస్తయి. యజమాని వానిని ఆమోదించి తీరాలె. అంతగా కష్టంగా వుంటే, కొద్దిగా గొణకటానికి, యితోధికంగా సణకటానికి అధికారాలు వున్నాయి కాని అవి ప్రత్యేకమైనట్టన్నీ, విశిష్టమైనట్టన్నీ అధికారాలు కావటంచేత, దైనందిన పరిపాలనలో వానిని ఉపయోగించకూడదు. క్లిష్టపరిస్థితులలో అసామాన్య సంఘటనలూ, సన్నివేశాలూ వచ్చినపుడు మాత్రమే యీ హక్కులను వినియోగించుకొనవలెను.

ఇల్లాంటి రాజ్యాంగ విధానంలో యజమాని యిల్లాలికి లోబడినవాడు అయినాడనిగాని, అధికారాలు లేనివాడు అయినాడనిగాని అనుకోటం, లేక పైకి బహిరంగముగా అనటమూ రాజద్రోహంగా పరిగణించబడుతుంది.

యజమానికి కావలసినంత స్వేచ్ఛవుంది. బడ్జటులో తనకై కేటాయింపబడిన డబ్బులోనుంచి భీమా సొమ్ము కట్టి మిగిలినది సిగిరెట్లు కొనుక్కోటానికి, ఎప్పుడైనా కాస్త కాఫీహోటలుకు వెళ్ళటానికి యథేచ్ఛగా వాడుకోవచ్చు. ఇవి అతని జన్మహక్కులు, లేక ప్రాథమిక హక్కులు.

ఈ గృహయజమానికి హక్కులు ఎల్లాగున్నయ్యో, బాధ్యతలూ అల్లాగేవున్నయి. అవి ముఖ్యంగా రెండు.

ఈ గృహరాజ్యానికి రాబడుతూన్న ఆదాయమును అనేక విధాలుగా వృద్ధి చేయటమూ, అవసర సమయంలో అప్పులు పుట్టించి తెచ్చియిస్తూ వుండటమూనూ.

ఇక్కడ యింకొక విషయముకూడా చెప్పవలసివుంది. ఇంటిని, యింటి పరిసరాలను కాపాడుతూవుండే బాధ్యత యజమానిదే కాబట్టి, యజమాని నిర్వహించేది కేంద్ర ప్రభుత్వమూ, యిల్లాలు నిర్వహించేది స్థానిక ప్రభుత్వమూ అనికూడా నిర్వచనం చేయవచ్చు.

ఇంతికూ చెప్పవచ్చింది ఏమిటీ అంటే, యీ స్థానిక ప్రభుత్వ నిర్వహణలో యిల్లాలు నిమగ్నురాలై వుంటుందీ అని! ఆమె నిత్యజీవితం ఎల్లాంటిదీ అన్నప్పుడు, ఆమె యిల్లు ఊడ్చునూ, వంటవండునూ అని యిల్లాగ అతిస్వల్ప విషయాలను వర్ణించటం వుచితంకాదనీ, ఆమె జీవితం ఏ మార్గాన నడుస్తున్నదో, ఆ మార్గాన్నిమాత్రం చూపితే చాలుననీ మా అభిప్రాయం.

ఈ రాజ్యాంగవిధానంలో కేంద్రప్రభుత్వం కాస్త బలహీనంగానూ, స్థానిక ప్రభుత్వం బలమైనదిగానూ వుంటూ వున్నమాట గమనించతగ్గది.

స్థానిక ప్రభుత్వ విషయాలలో కేంద్రం అనవసర జోక్యం కలుగజేసుకొన్నప్పుడు, స్థానిక ప్రభుత్వంవారు కేంద్రంపై దెబ్బతీయటానికి చాలా అవకాశాలున్నమాట నిజమే. ఒక్కొక్కప్పుడు అల్లాంటి దాడి జరిగి, ఉభయ కేంద్రాల మధ్య రాయబారాలు జరగడమూ, చివరకు సమరసభావంతో సంధి కుదిరి, దాని ననుసరించి కేంద్ర

ప్రభుత్వం, స్థానిక ప్రభుత్వాధికారులకు, నూతన వస్త్రాదు లనూ, విలువగల బంగారపు నగలనూ యిచ్చి, వారిని తృప్తిపరచి వారి అనుగ్రహము సంపాదించవలసిన అగత్యం కూడా కలుగుతుంది.

ఇల్లా ప్రభుత్వశాఖలు విడివిడిగా వుంటూవున్నప్పటి కినీ, కేంద్ర, స్థానిక ప్రభుత్వాలమధ్య తగవు రావటానికి అనేకమైన అవకాశాలు వుంటూవున్నవి. ముఖ్యంగా వుభయ కేంద్రములవారి అధీనమైయున్న అతిథి సత్కార విషయ ములో యిటువంటి తగవులు వస్తూ వుంటవి.

అతిథులు రెండు రకాలుగా వుంటూ వున్నారు. ఆమె నైపు వారు; ఆయననైపు వారు.

ఇంతులో యిల్లాలు తరపు బంధువులు వచ్చినప్పుడు యింటాయన బహు శ్రద్ధాభక్తులతో ప్రవర్తించవలసి వుంటుంది. వారియెడల యెట్టి అపచారమున్నూ జరగకూడదు.

ఇల్లాలు అంటుంది 'మా అమ్మ వస్తున్నదండీ' అని. అప్పుడు యింటాయన వుదాసీనభావంతో మౌనంగా వుండ టమూ లేక 'సరే' అని వూరుకొనటమూకూడా ప్రభుత్వ విద్రోహక చర్యగానే పరిగణించబడుతుంది. యజమానితో యిల్లాలు సరిగ్గా మాట్లాడక పోవడమూ ఏదైనా ప్రశ్న అడిగినపుడు, ఊఁ, ఆ, అను ఏకాక్షర శబ్దాలతో జవాబు చెప్పడమూ — ముక్కు మూతి విరుపులను ప్రదర్శించటమూ జరుగుతుంది. ఇది అల్ప విషయమైనప్పటికీ యింటాయనకు అధికమైనటువంటి మనఃక్లేశానికి కారణము అవుతుంది అన్న విషయము నిర్వివాదాంశం.

కాబట్టి ఇట్టి దుస్థితి రాకుండా వుండటానికి, ఇంటా యన ఆమెగారి తల్లి వస్తూవున్నదని వినటంతోనే వికసించిన వదనము తో, అమితమైన ఆనందాన్ని ప్రకటిస్తూ, అంత కంటే సంతోషాన్ని యిచ్చే విషయము మరొకటి లేదని చెప్పవలెను.

అయితే ఒకటి. ఆ వచ్చే మనిషికి సరిగ్గా బయలు దేరే రోజున చలిజ్వరం రావాలనీ గాని ఆమె ఎక్కిన ఒంటెద్దు బండి దారిలో బోల్తాపడి ఆమె మోకాళ్ళకు తనుమాత్రం దెబ్బతగలాలని కాని, లేక ఆమె రావలసిన మార్గంలో ఒక రైలు వంతెన విరిగిపోయిన కారణాన రైళ్ళు నడవక ఆమె ప్రయాణం ఆగిపోవలెననిగాని మనస్సులో కోరుకొంటే, తప్పు లేదు. కాని 'ఉత్తరం వ్రాయండి, రేపు శనివారమే బయలుదేరి రమ్మని' అన్నప్పుడు, సంతోషంతో అంగీకరించి శనివారంరోజున ఏ బండికి మెయిలు ఎదురుగా వస్తూవుం టుందో చూచుకొని ఆ బండిలో ఎక్కిరమ్మని వ్రాయడం చాలా మంచిది. దాని తరువాత మన అదృష్టం! లేక ఇప్పు డెందుకు లే అన్నాడా; అది ప్రభుత్వ విద్రోహకచర్యగా పరిగణించబడుతుంది.

ఆ వచ్చిన ఆవిడ అమ్మగానీ అక్కగానీ, యెన్నాళ్ళు వున్నా యింటాయన విసుగుదల పొందకూడదు. ఈ కరువు రోజులలో బియ్యం వుండవు. ఎంత ఖరీదైనా పెట్టి చీకటి బజారులో కొనుక్కు రావాలిసిందే. ఇల్లాలు అవతల వాళ్ళతో అంటుందీ 'మా కేమీ యిబ్బంది లేదక్కా, బియ్యానికి! నీవేమైనా అనుకొంటున్నావేమో! మీ మరిదికి

ఆ అధికారులంతా స్నేహితులే! కావలసినన్ని బియ్యం సప్లయి అవుతాయి.' అంటూవుంటే గప్‌చిప్‌గా వూళ్లో వలసిందే! నల్లబజారులో విపరీతమైన ధరలకు బియ్యం తేవటం కష్టమై, మనఃక్లేశం కలిగితే పడకగదిలోకి పోయి, పరుపు మీద పడుకొని, మెత్తని దిండులో తలదూర్చి తగుమాత్రంగా గుట్టుచప్పుడుగా కన్నీళ్ళు కార్చటానికి మాత్రం గృహ యజమానికి హక్కువుంది.

ఆ గృహిణి అక్కగారు పదిరోజులు వుండి, వెడతాను అన్నప్పుడు యింకా రెండురోజులుండు అక్కా ఏం తొందర! వచ్చినప్పటినుంచి 'వెడతాను వెడతాను' అంటావు అని యిల్లాలు అంటూ వున్నప్పుడు, యజమాని అధికమైన నిగ్రహశక్తితో, నవ్వుతూ, 'ఉండు వదినా, ఏం వెడతావూ?' అనాలసిందేగాని 'అదేమిటి, అల్లా బలవంతం పెడతావు! మనము అసలు బియ్యంలేక నానా అవస్థా పడుతుంటే,' అని ఆమెతో రహస్యంగా అన్నా, అది చాలా ప్రమాదకరమైన అవస్థలకు దారితీస్తుందనీ గృహరాజ్య పరిపాలనా విధానానికి భంగకరమనీ గ్రహించవలసి వుంది.

ఇక యింటాయన స్నేహితుడుగాని, బంధువుగాని అతిథిగా వచ్చినపుడు కేంద్రప్రభుత్వంవారు స్థానిక ప్రభుత్వాధికారులకు యీ సంగతి ముందుగా తెలియపరచవలసిన అగత్యం వుందని గమనించవలెను.

ఆ వచ్చిన పెద్దమనిషి ఎవరు, పేరు, యింటిపేరు, ఎట్లా బంధువు? ఎందుకొచ్చాడు, ఎన్నాళ్లుంటాడు అని ఆమె

అధికారరీత్యా వేసిన ప్రశ్నలకు కేంద్రప్రభుత్వం వారు సావధానంగా, ఓపికతో సమాధానంకూడా యియ్యవలసి వుంటుంది.

ఆమెగారి సైపుగాక యిటుపై పు బంధువులు వచ్చినప్పుడు, ఆ క్షణంలో యింట్లోవున్న బియ్యం మాయం అవటమేకాక యెక్కడా అప్పుకూడా పుట్టదూ అన్నది గృహ యజమాని జ్ఞాపకం వుంచుకోతగిన విషయము.

అల్లాంటప్పుడు అతిథిసత్కారానికి కేంద్ర ప్రభుత్వం వారు కొంత సొమ్ము స్థానిక ప్రభుత్వానికి యిచ్చి పని జరుపుకొనటం ప్రపంచంలో చాలా యిళ్ళల్లో ఆచారము అయి వున్నది. అల్లా యిచ్చిన తరువాత అతిథి సత్కారం సంసార పక్షంగా జరిగిపోతుంది. జరిగిపోయినా ఆవిడ అనవలసిన నాలుగూ అనకమానదు – అని జ్ఞాపకం వుంచుకొని దానికై సిద్ధపడి వుండటం చాలా మంచిది. ఇంటావిడ 'ఎబ్బే! ఎన్ని సార్లు చెపితే ఏం లాభం! మనిషికి తెలియకపోయె! ఎవరినో ఒకరిని తీసికొచ్చి నెత్తిమీద కెక్కిస్తూ వుంటారు' అని అనటం సహజము. 'నేను మటుకు ఆయనను రమ్మని పిలిచానా! తీరా వచ్చిన వాళ్ళను యెట్లా వద్దనేది?' అంటాడు యజమాని! 'ఉండమని అనక ఏదో రాజకీయ విషయాలు మాట్లాడుతూ యెప్పుడో మధ్య, బియ్యం యిబ్బందినిగూర్చి చెప్పక పోయినారా, ఆ వచ్చిన ఆయన వచ్చినట్టే వెళ్ళిపోయేవాడు' అంటుంది యిల్లాలు. దానిమీద 'అల్లా అనటం మర్యాద కాదేమోనని వూరుకొన్నాను' అని ఇంటాయన అంటాడు. 'ఈమర్యాదలన్నీ పెట్టుకుకూర్చుంటే అయినట్లే' అని యిల్లాలు

నసుగుతుంది. ఇది మామూలు పరిస్థితులలో జరిగే కార్య క్రమము. అంతటితో ఆ వ్యవహారం ఆగిపోయి ఏదోవిధంగా అతిథిసత్కారం తృప్తికరంగానే జరుగుతుంది. ఏ యిల్లాలూ వచ్చిన అతిథిని అవమానపరచీ, అప్రతిష్ఠ తీసికొనిరాదు.

కాని ఒక్కొక్కప్పుడు ఈ వ్యవహారం యింకా కాస్త పైకే పోతుంది. ప్రతిరోజూ రాత్రిళ్ళు సమావేశమయ్యే సుప్రీంకోర్టుదాకా వెళ్ళటమూ, ఈ కరువుకాలంలో అతిథులను తీసుకొని రావటమనేది రాజ్యానికి మోయరాని బరువు అవటమే కాక, ప్రశాంతమైన యిల్లాలి జీవితంలో కల్లోల కారకమైనట్టి, అవాంఛనీయమైనట్టి కృత్యంగా నిర్ణయింపబడటమూ, అటు తరువాత, కర్ణమర్దన అనే శిక్షకు యజమాని పాత్రుడు కావడమూకూడా జరుగుతూ వుంటుంది.

ఇంటాయన ఇంతటి స్వల్పశిక్షతో బైటపడితే చాలా సంతోషించవలసిన విషయమనిన్నీ, ఆ ప్రాచ్యదేశాలలో ఇల్లాలు, ఇంటాయనను, యింతకంటే ఎక్కువైన కఠిన శిక్షలకు పాల్పడచేస్తున్నది అనీ, అది ఆ దేశాలలో చట్ట సమ్మతము అయిన చర్య అనీ మనము గ్రహించగలిగితే, మనకు చాలా తృప్తి కలుగుతుంది.

# శిష్టప్రశ్న

ఎవరైనా అందమైన చెప్పులు తొడుక్కొంటే మనము చూచి 'ఎక్కడ కొన్నారండీ యివి, బాగున్నాయి' అని అంటాము ఆ మాటలు మనం ఏదో యథాలాపంగా అనాకాంక్షితంగా అంటామే కాని ఆ చెప్పులు మనకు కావాలనే కోరికను మనస్సులో పెట్టుకొని అనము కదా!

కాని కాంతయ్యగారు నా విషయంలో అల్లాగ అనుకొన్నారని అన్నగారు చెప్పారు. అనుకుంటే అనుకొనే వుండవచ్చు. ఎందుకంటే దాని తరువాత జరిగిన కొన్ని విషయాలు అల్లాగ అనుకొంటానికి అవకాశం ఇచ్చినవి.

అసలు జరిగింది ఏమిటీ అంటే — రెండు నెలల క్రిందనేను బెజవాడకు వెళ్ళాను. రేడియో స్టేషనులో ఏదో పని ఉంటే చూచుకువస్తుంటే శాస్త్రి కనపడి, 'మీ అన్నగారు వచ్చారయ్యా, డాక్టరుగారింట్లో వున్నారు' అన్నాడు. సరే ఆ రోజున ప్రయాణం మానేసి డాక్టరుగారింటికి వెళ్ళాను. అన్నగారిని కలుసుకొన్నాను. మేము ఇష్టారం మాట్లాడుతూ వున్నప్పుడే డాక్టరుగారి స్నేహితుడు కాంతయ్యగారు వచ్చారు. అన్నగారు ఆయనను నాకూ నన్ను ఆయనకూ పరిచయం చేశారు. ఆ మాట ఎందుకు అనవలసి వచ్చిందో జ్ఞాపకం లేదుగాని నేను మటుకు కాంతయ్యగారితో 'మీ చెప్పులు బాగున్నయి అండీ' అని అన్నమాట నిజం.

ఆ రాత్రి నేను అక్కడే పడుకొన్నాను. చాలా ప్రొద్దుపోయిందాకా అన్నగారూ నేనూ మాట్లాడుతూ కూర్చున్నాము. పన్నెండింటికి కాబోలు నిద్రపట్టింది. మళ్ళీ వెంటనే లేచాను, మూడుగంటలబండికి బందరు వెళ్ళిపోవటానికి. ఆ బండికి వెళ్ళకపోతే మరునాడు స్కూలుకు అందుకోలేను.

అందుకని రెండున్నరకే లేచాను. అరగంటలో రైలు స్టేషనుకు వెళ్ళాలి, సుమారు ఒక అరమైలు నడచి. అన్నగారిని లేపి నేను వెడుతున్నానని చెపితే ఆయన 'తొందరగా వెళ్ళు, టైము కావచ్చిం'దన్నాడు.

అక్కడ లైటు లేదు. చీకటిగా వుంది. లేవటమే ఆలస్యంగా లేచాను. పైగా ఆయన టైము అయిందనికూడా అన్నారు.

అందుకని హడావుడిగా బయలుదేరాను. నా చెప్పులు కనపడలేదు. అక్కడ నాలుగైదు జతలున్నవి. అన్నీ కొంచెం హెచ్చు తగ్గుగా ఒకే మోస్తరుగా వున్నవి. అయినా నేను నా బుద్ధినంతా వినియోగించే నా చెప్పులు జాగ్రత్తగా ఏరుకొని తొడుక్కొనివెళ్ళాను. స్టేషనులోనికి వెళ్ళి దీపాలముందు చూచుకొందునుగదా, అవి నావి కాదు !

ఆ చీకటిలో, హడావుడిలో, నిద్రమత్తులో పొరపాటున అవి తొడుక్కొచ్చాను. అవి నాకు సరిగ్గా సరిపోవటం మూలాన అవి నావి కావేమోనని అనుమానం అన్నా కలగలేదు.

అవి కాంతయ్యగారి చెప్పులు! అరెరె! ఎంతపని జరిగింది. ఇప్పుడెల్లాగా - అనుకొన్నాను. కాని ఏంలాభం. బండి బయలుదేరే సమయం అయింది. వెళ్ళి యిచ్చి రావటానికి టైములేదు. ఒకవేళ వెళ్ళినా ఆ చీకట్లో నా చెప్పులు కనపడతయ్యా ఏమన్నానా. ఈ తభాకు వెళ్ళిపోదాము. మళ్ళీ పదిరోజులలో బెజవాడ వస్తునేవుంటిని. అప్పుడు యీ చెప్పులు యిచ్చేసి నావి నేను తీసుకొనిపోవచ్చును. ఇంతలో వచ్చిన ప్రమాదము యేముంటుందిలే అని అనుకున్నాను. గాని, యిదంతా ఒక పెద్ద అల్లరిఅయి నామీద విసుచుకు పడుతుందని నేను అనుకోలేదు. ఇంతకూ సరిగ్గా ఆలోచించటానికి టైముకూడా లేకపోయింది. రైలు కూసింది. నేను చటుక్కున బండిలో యెక్కి కూర్చున్నాను. ఆ చెప్పులు నా కాళ్ళనే వుండిపోయినయి.

నా చెప్పులు డాక్టరుగారింట్లో వదిలేసి వచ్చాను. కాబట్టి యీ చెప్పులతే నేను తొడుక్కొని తిరగవలసిన అగత్యం యేర్పడ్డది. అందుకని వేసుకు తిరుగుతున్నాను.

ఆ చెప్పుల అడుగున కొద్దిగా చినుగులు వున్నయి. రోడ్డుమీద నడుస్తుంటే గులకరాళ్ళు కాలిగి గుచ్చుకొంటున్నవి. అందుకని రబ్బరుటైరు వేయిస్తే కాలిక్రింద మెత్తగా వుంటుంది - వేయిద్దామా అని ఒక ఆలోచన వచ్చింది. అవి మళ్ళీ యిచ్చేసేవేగదా, యెందుకు ఓ పావలా దండుగ పెట్టడం అనికూడా అనుకొన్నాను. అనుకున్న వాడిని ఊరుకోకూడదూ! కర్మ ఊరుకోనియ్యలేదు. పోనీలే, వున్నావాళ్ళు హాయిగా

తొడుక్కుందాం, పావలాలో వచ్చిన నష్టం యేముంది. అని అనుకొని రబ్బరు పైరుకూడా వేయించాను.

చెప్పు జతటుకు చాలా అందంగా వున్నయి. ప్రతి వాడూ చూచి, 'చాలా బాగున్నాయి – ఎక్కడ కొన్నావో చెప్పు' అని అడగటం సాగించారు.

ఏం చెప్పేది జవాబు! యివి నావి కావు, యెవరివో తొడుక్కొని వచ్చానని యెట్లాచెప్పేది! అందుకని 'యివి యీ వూళ్ళో కొన్నవికావు, మద్రాసులో కొన్నాను' అని చెప్పవలసివచ్చింది.

నేను ఆయన చెప్పులు తొడుక్కొని తిరుగుతున్నా ననీ, వాటికి రబ్బరుపైరు వేయించి స్వంతం చేసుకొన్నాననీ పైగా మద్రాసులో కొన్నానని చెబుతున్నాననీ కాంతయ్య గారికి తెలిసిందట. ఇక ఆయన నన్ను గురించి ఏమనుకొంటాడు!

కర్మ అల్లాగ తోసుకొచ్చింది. నేను ఆరోజునే అనా లోచితంగా మీ చెప్పులు బాగున్నయి అనటం, అవే తొడుక్కుని రావటం, అందరితోనూ మద్రాసులో కొన్నా నని చెప్పటం, పైగా అవి నా స్వంతమే అయినట్లు బాగు చేయించుకోనటమూ యిన్నీ కలిపి ఆలోచిస్తే ఆయనకు యెంతో స్తుంది! నేను కావాలని బుద్ధిపూర్వకంగా ఆ చెప్పులు యెత్తుకొచ్చానని ఆయన అనుకొన్నాడంటే అందులో ఆశ్చర్యపడాలిసిన విషయం లేదు. అనుకొనే వుంటాడు.

కాని దైవసాక్షిగా చెబుతున్నాను; నాకు అటువంటి వుద్దేశం యేకోశానా లేదు. అనాలోచితంగా చేశాను యీ పనులన్నీ. దాని ఫలితం అనుభవించాను.

ఈ చిన్ని పొరపాటువలన యింత నుపద్రవం వస్తుందని నేను అనుకోలేదు. అన్నగారు వచ్చి చెప్పిందాకా నాకు ఆ విషయమే తోచలేదు. ఒకరోజున ఆయన నాకు కపపడి, 'నీవు డాక్టరుగారింటికి వచ్చిన ఓ పెద్దమనిషి చెప్పులు తొడుక్కొని వచ్చావుటగదా' అన్నారు. 'నిజమే పొరపాటున తొడుక్కొచ్చాను. ఈ తఫా బెజవాడ వెళ్ళినప్పుడు యిచ్చేస్తాను' అన్నాను.

ఈ పని నేను బుద్ధిపూర్వకంగా చేశానని ఆయన అనుకొని పోతాడని నాకు గుండెలలో భయంగానే వుంది. అందుకని అనేక విధాల ప్రాధేయపడి, చెప్పాను - దురుద్దేశం యేమీ లేదనీ, కేవలం పొరపాటనీ!

చెప్పంగా చెప్పంగా ఆయన నమ్మారు. నామీద కాస్త జాలికలిగింది కూడా. కలిగి యిల్లాగ అన్నారు.

'సరే, యేదో అయిపోయిందేమో అయిపోయింది. చెప్పులు మళ్ళీ యియ్యొద్దు - పెట్టొద్దులే. ఊరుకో. ఆ చాయలకుమాటుకు పోవద్దు. బెజవాడకు యేదైనా పనిమీద వెళ్ళినప్పుడు కాస్త అటూ, యిటూ, వెనకా, ముందూ చూస్తూ నడు, ఆ కాంతయ్య కనపడతాడేమోనని! అతడుగాని అతని స్నేహితులుగాని కనపడితే, కాస్త తప్పించుకు తిరుగు.'

'ఏమండీ, ఎందుకు అల్లాగ అంటున్నారు?' అన్నాను.

'వాళ్ళూ - నీవు బుద్ధిపూర్వకంగానే ఆ చెప్పులు తీసికొని వెళ్ళావని అనుకొంటున్నారు. అందుకని వాళ్ళకు కోపంవచ్చింది. వాళ్ళు యేంచేసినా చేయగలరు. తీరా చెయ్యి చేసుకొన్నతరువాత యేమనుకొని యేంలాభం?

ముందుగా జాగ్రత్తపడు. ఎందుకు చెప్పానో నా మాటవిను' అన్నారాయన.

నన్ను గురించి అవతలవాళ్ళు యిల్లాగ అనుకొన్నారని విని నేను నిలువున నీరైపోయినాను. దుఃఖంవచ్చి అన్నాను, 'మీరైనా చెప్పకపోయినారా అన్నగారూ, నేను అల్లాంటి మనిషి కాదు, పెద్దమనిషి నని.'

నా మాటలు ఆయన విని విచారంగా ముఖంపెట్టి 'చెప్పాను తమ్ముడూ, చెప్పాను. అయితే యేంలాభం. వాళ్ళు వినలేదు. నీవు పెద్దమనిషిలాగ వాళ్ళకు కనుపించలేదుట!' అన్నారు.

నాకు చాలా కష్టంకలిగింది. దుఃఖం వచ్చింది. అన్నగారుకూడా చాలా విచారపడుతున్నట్లు కనపడ్డారు. ఇద్దరం కూడా కాసేపు మాట్లాడకుండా, ఒకరినొకరు చూస్తూ కూర్చున్నాము. ఆయన కళ్ళల్లోనూ, ముఖవైఖరిలోనూ, కనబడుతూనే వుంది—ఆయనకు నాయందు సానుభూతివున్నట్లు. ఆయన నాయందు జాలిచూపుతూ చివరకు 'యిక యెందుకులే అదంతా. అయినా నీవు చేసేదీ యేమీలేదు. నీ జాగ్రత్తలో నీవు వుండు' అని హితవుచెప్పి వెళ్ళిపోయినాడు. 'ఇట్లా వచ్చిందేం కర్మం' అని అనుకొని నేను ఆ వంతెనపైన అల్లాగే కూర్చున్నాను.

సంజెకాంతులు క్రమంగా మాయమైనవి. చీకట్లు కమ్ముకొన్నాయి. ఈ విచిత్రాన్ని చూచి నక్షత్రాలు నవ్వుకొన్నాయి. నేను యీ అవమానంలోనుంచి ఎల్లాగ బైటపడాలో తోచలేదు.

ఎంత ఆలోచించినా అన్నగారు చెప్పినదానికంటే మంచి ఆలోచన యింకొకటి యేదీ తోచలేదు. దాని తరువాత ఒకటి రెండుసార్లు బెజవాడ వెళ్ళినాకూడా ఆ డాక్టరుగారి యింటివైపుకు వెళ్ళలేదు. బజారులో తిరిగేటప్పుడుకూడా వాళ్ళు కళ్ళపడలేదు. కాని ఆయన నన్ను పెద్దమనిషిగా యెంచలేదే! నాలో పెద్దమనిషితనం యే విధంగా లోపించిందా అన్న విచారంమటుకు నన్ను విస్తారం బాధపెట్టింది. ఈ నా ప్రవర్తన వాళ్ళ అనుమానాన్ని మరీ బలపరుస్తున్నదీ – అన్న విషయం డాక్టరుగారి దగ్గరనుంచి ఒక రోజున ఉత్తరం వచ్చిందాకా నేను గుర్తించలేదు. ఆ ఉత్తరంలో యిట్లా వ్రాశారు.

'మీరు మా యింటికి రావటం బొత్తిగా మానేశారు. ఈమధ్య బెజవాడ ఒకటి రెండుసార్లు వచ్చికూడా నన్ను చూడకుండా వెళ్ళిపోయినారు. ఇదేమీ బాగుండలేదు. నేనూ, యితరస్నేహితులూ మిమ్ముల్ను చూడాలని తహతహలాడుతున్నాము. ఈ తఫా మీరు తప్పకరండి. రాకపోతిరా మాటదక్కదు.'

ఈ ఉత్తరాన్నిబట్టి వాళ్ళ వుద్దేశం స్పష్టంగా తెలిసిపోయింది. అన్నగారు చెప్పింది అక్షరాలా నిజం అయింది అనుకొన్నాను. మాటదక్కదు అనటంలో వాళ్ళ వుద్దేశం తెలియనే తెలిసింది.

కాని యెన్నాళ్ళని యిల్లాగ తప్పుకు తప్పుకు తిరగటం. ఛీ, యిది దొంగపని అనిపించింది. నా ప్రవర్తన నాకే అసహ్యం వేసింది.

అప్పుడు నాకు ఒకటితోచింది. ఈతభా వెళ్ళినప్పుడు యేమైనాసరే వాళ్ళ చెప్పులు వాళ్ళకు యిచ్చేయాలె. ఇచ్చి క్షమించమని కోరాలె. క్షమిస్తారా సరేసరి – క్షమించరూ, జరగవలసింది జరగనీయి. అంతేకాని దొంగపని చేసిన వాడిలాగ యిల్లాగ భయపడుతూ తప్పుకు తప్పుకు తిరగటం మటుకు మంచిపనికాదని నిశ్చయించుకొన్నాను.

చెప్పులుకూడా కొత్తగానే వున్నవి. రంగుపోలేదు. అరిగిపోలేదు. అడుగున రబ్బరుటైరు వేయటం మూలాన సుఖకరంగా కూడా వున్నయి. ఆ ఆసామీ వీటిని మళ్ళీ చూచినప్పుడు, పాపం జాగ్రత్తగానే వాడాడు. తొక్కి పాడు చేయలేదు అని అనుకొంటాడుగదా అని నేను కాస్త తృప్తి పడుతూ వుండేవాడిని.

ఆ చెప్పులు తొడుక్కున్నప్పుడల్లా అనుకుంటూ వుండేవాణ్ణి. ఇక 'పదిరోజులలో యిచ్చేస్తాను. మాట దక్కుతుంది' అని రోజులు లెక్కపెడుతున్నాను.

ఇంతలో ఒక విచిత్ర సంఘటన జరిగింది. అది జరక్క పోతే నేను బ్రతికి బైటపడేవాడిని, కాని జరిగింది! అది యేమిటి అంటే ——

శనివారంనాడు పొద్దున నేను కాఫీ తాగి కుర్చీలో కూర్చుని యేదో చదువుకొంటున్నాను. 'నీకోసం ఎవరో వచ్చారు నాన్నా!' అని అబ్బాయి వచ్చి చెప్పాడు. ఎవ్వరో కనుక్కోకపోయినావురా, అంటే 'కనుకున్నాను నాన్నా. వారిది బెజవాడట' అన్నాడు.

బెజవాడనుంచి యెవరో వచ్చారనేసరికి నా గుండె గుభేలుమన్నది. కొందరు పాములాగ పగపడతారు. బెజవాడ నుంచి అయితే వాడే అయివుంటాడు – ఇంకెవరు వున్నారు రావటానికి?

అతను రాకముందే నేను వెళ్ళి ఆయన చెప్పులు ఆయనకిచ్చేసి వున్నట్లయితే యెంత బాగుండేది! ఏదో పొరపాటున పాపం, తీసికెళ్ళాను. మళ్ళీ తీసుకొని యిచ్చేశాను. తొక్కి పాడుచేయలేదుకూడా అని అందరూ అనుకొనేవాళ్ళు! అల్లాగ పరువుదక్కించుకొంటానికి అవకాశం లేకుండా ఆయన రానేవచ్చె! కర్మం కాలిపోతే యేమిటిది!

ఇప్పుడేమనుకుంటాడు. దుర్దేశం వుండబట్టే ఇన్నాళ్ళనుంచి యియ్యలేదు. నిజంగా యే దురుద్దేశం లేకపోతే బెజవాడకు రెండు మూడుసార్లు వచ్చికూడా యెందుకు యియ్యకపోవాలి అని అనుకోడూ!

వెళ్ళి యిద్దామని అనుకొంటూనే వున్నాను. ఇంతలో యీయన రానేవచ్చె! యేంజేసేది! పాపం ఆ డాక్టరుగారు నీవు చెప్పులు తీసికెళ్ళావు అని నోటితో అనకుండా ఆ సంగతి జ్ఞాపకం వచ్చేటట్లు వుత్తరం వ్రాశాడాయె! అప్పుడైనా వెళ్ళి వాళ్ళ వస్తువు వాళ్ళకు యిచ్చి రాకపోతిని.

ఛీ ఛీ అన్నీ తెలివితక్కువ పనులు చేశాను. ఇప్పుడేమో తీరా ఆయనవచ్చి వాకిట్లో కూర్చునె! పైగా నేను యిన్నాళ్ళా తప్పించుకు తిరుగుతున్నట్లు కూడా ఆయనకు తెలిసె! 'ఏమయ్యా ఏంపని ఇది' అని నిలవేసి నాలుగూ అడిగితే ఏంజెప్పేది? ఇప్పుడు నాకు దురుద్దేశం లేదని యెంత చెపితే

వేం లాభం? నమ్ముతాడా యేమన్నా నా! ఇల్లాగ పరిపరి విధాల మనస్సు పోయి యేమయోతిన పడ్డాను కాసేపు.

చివరకు యేమన్నా కానీయమని వసారాలోకి వచ్చాను. అక్కడ కూర్చున్నది కాంతయ్య కాదు. యెవరో కొత్త మనిషి.

ఒక్క నిమిషంసేపు ఆలోచించాను – యీాయన యెవరూ అని! అట్టేసేపు ఆలోచించకుండానే ఆయన యెవరై ఉండేదీ నామనస్సుకు తోచింది. ఈయన తప్పకుండా కాంతయ్య పంపిన మనిషి! ఆ ముఖమే చెప్తున్నది – చెప్పులకోసం వచ్చినట్లు.

ఇదీ ఒకందుకు మంచిదే అనుకొన్నాను. అసలు ఆయనకు ఉన్నంత కోపం, ఈయనకు ఉండదు. ఈయన కిచ్చి పంపేస్తే సరిపోతుందని కాస్త మనస్సుకు శాంతి గలిగింది.

వెంటనే చెప్పులు తెచ్చి ఆయన ముందు పెట్టి 'క్షమించండి. పొరపాటున తొడుక్కొచ్చాను' అని అనేవాణ్ణే కాని ఆక్షణంలో ఒక సందేహం వచ్చింది. అసలు ఈయన కాంతయ్య పంపిన మనిషేనా అని!

కాంతయ్య పంపిన మనిషి కాకపోతే మనింటికి ఎందుకొస్తాడు? ఆ వాలకం తెలుస్తూనే ఉంది. కాని అయినా యెందుకో ఆ సందేహం వచ్చింది.

వచ్చి, 'ఏమండీ, చెప్పులకోసం వచ్చారా?' అని అడిగాను. ఆయన అడిగిందాకా ఉండకుండా మనమే యెదు ఆయన వస్తువ ఆయన కియ్యటానికి ఆదుర్దా కనపర్చటంవలన, మన నిర్దోషిత్వము కొంత ప్రకటితము అవుతుందని నా ఊహ.

ఆ పెద్దమనిషి, తెల్లబోయి, 'చెప్పా లేమిటండీ?' అన్నాడు.

నేనూ తెల్లబోయినాను, యీాయన కాంతయ్యగారు పంపిన మనిషి కాకపోతే ఇంకెవరా అని!

ఇంకా నయం-చెప్పులు రెండూ తెచ్చి ఆయన ముందు పెట్టి క్షమించమన్నాను కాను. అన్నట్టయితే నవ్వులబాటు పని అయ్యేవి అనుకొని, 'నేను ఏదో, అనుకున్నాను లెండి, అయితే మీారు ఎవరో, ఎందుకొచ్చారో చెబుతారా' అన్నాను.

ఆ పెద్దమనిషి "మాది గుడివాడండి - శాస్త్రిగారు పంపారు" అని మిగతా విషయము నన్ను గ్రహించమన్నట్లు చూశాడు.

నేను నిర్ఘాంత పోయినాను. ఈశాస్త్రి యెవరు నా ప్రాణానికి! కాంతయ్య చెప్పులు తెచ్చినట్టుగా వాడిగారు గేమైనా తెచ్చారా యేమిటి ఖర్మం ఎప్పుడైనా! నాకేమి జ్ఞాపకం రాలేదు.

ఆ వచ్చిన పెద్దమనిషి ఆ ఒక్కమాట అని ఊరుకున్నాడు. ఆపేరు చెపటంతోనే ఏదో విషయం జ్ఞాపకం వస్తుందని ఆయన ఊహ అయిఉంటుంది. అల్లాగ జ్ఞాపకంవచ్చే మనస్థైర్యము నాకు లేదాయె!

నామనస్సు ఒక్క దారిలోనే పనిచేస్తున్నది. అన్ని విషయాలు జ్ఞాపకం తెచ్చుకొనే శక్తి లేదు ఆయన అల్లాగ చూస్తూ ఉండిపోవటంవల్ల నాకు చికాకెత్తింది. "ఏమిటి

చెప్పాలా, గొడుగా? తొందరగా చెప్పు నన్ను పంపక ?అని అనేటంతటి విసుగ్గాఉంది. అదృష్టవశాత్తూ అనలేదు

నా ఆందోళనచూచి, గ్రహించి, ఆయన ఓ చిన్న ప్రకటన కాయితం నా చేతి కిచ్చాడు.

ఆ కాయితంలో విషయాలు చూచినతరువాత నాకు జ్ఞాపకం వచ్చింది, ఆ శాస్త్రి ఎవరో, ఆ సంగతి ఏమిటో!

నేను నవ్వుకొని "ఊఁ, నిజమే. మరిచిపోయినాను సుమండీ!" అన్నాను.

'శాస్త్రిగారూ ఆ మాటే చెప్పారు!' అన్నాడు ఆ వచ్చిన పెద్దమనిషి.

'ఏమని చెప్పారు?'

'తమకు తగని మరుపని!' అని నవ్వాడు ఆయన. ఈ జబ్బుకూడా నాకు ఉందని అందరూ అనుకొంటున్నా రన్నమాట అని – నా కర్మాన్ని నేను నిందింకొంటూ – పైకి మాత్రం నవ్వుతూ, 'సరేలెండి. రెండుగంటల బండిలో బయలుదేరి వస్తాను. మీరు ముందు వెళ్ళండి' అన్నాను.

వెళ్ళటానికి ఇష్టంలేనట్లు ముఖంపెట్టి ఆయన 'అల్లా కాదండీ, చుట్టుప్రక్కల ఊళ్ళనుంచికూడా చాలామంది సభకు వస్తున్నారు–ప్రత్యేకంగా మీ ఉపన్యాసం వింటానికి! మీరు రాకపోతే, వాళ్లు మమ్మల్ని బ్రతుకనియ్యరు. దయచేసి ఈ పదకొండు గంటల బండికే బయలుదేరండి' అంటూ కూర్చున్నాడు.

'ఇంకా వంటకాలేదు. భోజనం చెయ్యాలె. సడవు. కాని నా మాటవిని, మీరు వెళ్ళండి ఈ బండికి. నేను రెండు గంటల బండికి తప్పకవస్తాను' అన్నాను.

అంటే నమ్మడే! ఎంతచెప్పినా నమ్మడు. చివరకు నేను అన్నాను. 'మీరు ఏమన్నా అనండి. ఈ బండికిమటుకు రాను. రెండుగంటల బండికి తప్పకవస్తాను!'

''అయితే నేనూ రెండుగంటల బండివాకా ఉంటాను! మీరూ నేనూ కలిసేపోదాము. మిమ్ములను వెంటబెట్టుకొని రమ్మన్నారు శాస్త్రిగారు. ఆయన 'వస్తాను మీరు పొండి' అంటారు. 'వస్తానుగదా, అని నీవు అల్లాగ రాకుసుమీ' అని ఆయన మరీ, మరీ చెప్పారు'' అన్నాడు ఆయన.

నామాటమీద విశ్వాసంకూడా లేదన్న మాట వీళ్ళకు! ఒకరి కేమన్నా నేను పెద్దమనిషిగా కనుపించ లేదూ! ఇంకొకరి కేమన్నా నామాటయందు విశ్వాసం లేదూ? ఇట్లాగుంది కదా ప్రపంచం!

ప్రపంచంసంగతి అట్లావుంచి ఇప్పుడీ పెద్దమనిషిని పంపటం ఎట్లా? పంపక భోజనానికి లెమ్మనాలిసిందేనా అని తటపటాయిస్తూ ఉండగానే, ఆయన కడుపుచల్లగావుండా, ఆయన అన్నాడు: 'మాస్టరుగారూ, నేను మా అక్కగారింటికి వెళ్ళి భోజనంచేసి వస్తాను. మీరు మీ ఇంటివద్దే ఉండండి, నేనొచ్చి తీసికెడతాను.' అని! తరువాత ఆయనను మాయింట్లో భోజనం చేయవలసిందని కోరాను. ప్రాధేయ పడ్డా ననుకోండి. అయితే ఆయన ఉండనూ లేదు. వెళ్ళి భోజనంచేసి ఒక గంటలో వచ్చాడు.

రెండుగంటల బండీలో గుడివాడ వెళ్ళాము. నేను అక్కడ ఉపన్యాసం ఇచ్చాను. జనం చాలామంది వచ్చారు. నేను సంతోషించాను ఇంతమందిని నవ్వించగలిగానుకదా అని.

ఉపన్యాసం అయినతరువాత యువకులు నా చుట్టూ చేరి ఏవో కొన్ని ప్రశ్నలు అడగటమూ వారందరికీ నేను సమాధానాలు చెప్పటమూ జరిగింది.

ఇది అంతా అయినతరువాత వచ్చి చూచుకొంటాను గదా; నా చెప్పులు లేవు. ఎవరో తొడుక్కుని వెళ్ళారు. నా చెప్పులూ అంటే మరేవీకావు, అవే!

అప్పటికి అందరూ వెళ్ళిపోయినారు—నాతో మాట్లాడుతూవున్న ఏకొద్దిమందో తప్ప! ఎవరిని అడిగేది?

'ఇవి నావికావు' అని చెప్పితే దయదల్చి ఇచ్చివేసేవారేమో కాని అసలు ఆమాట ఎట్లా చెప్పేది!

'పోతే పోయినవిలెండి మాస్టారూ, వాటకోసం ఊరికే ఇది అవ్వుతారు ఎందుకు?' అన్నాడు ఓ కుఱ్ఱవాడు.

ఎవ్వరికీ విచారంగా లేదు. నేను విచారపడటం అందరికి నవ్వులాటగా వుంది. చేసేది ఏమీలేక వట్టికాళ్ళతో ఇంటికి వచ్చేశాను.

ఇంట్లో మా ఆవిడకు ఈ సంగతి తెలిసింది. ఇక ఆవిడ ప్రారంభించింది సాధింపు.

'అయ్యో, అయ్యో మీ తెలివితక్కువతనము తెల్లవార! ఇప్పు డెట్లాగండీ. ఏముఖం పెట్టుకొని చూస్తారండీ, ఆ కాంతయ్యగారిని?'

'ఏ ముఖం పెట్టుకొని చూసేవె. ఈ మామూలు ముఖం పెట్టుకొనే చూడాలె!'

ఆవిడ మళ్ళీ ఎత్తుకొని యిట్లా అన్నది. ''ఆయన చెప్పులు ఆయనకిస్తే ఎంతమర్యాదగా ఉండేది! ఇప్పుడేమను కొంటాడు!'

అవును, ఆయన ఏమనుకొంటాడో తెలియబట్టే విచారపడుతున్నాను.

మళ్ళీ మొదలు. 'అసలు మీరు ఆ చెప్పులు తొడుక్కు రావటమే తప్పుకదా. ఇక పారేస్తే! అయ్యో మీరు చేసేవన్నీ ఇటువంటిపనులే. మధ్య నేను చస్తున్నాను' అన్నది ఆవిడ.

ఎన్నిమాటలు అన్నా ఊరుకొన్నానుగాని చివరకు 'మీరు చేసేవన్నీ ఇటువంటి పనులే' అన్న మాటమాత్రం నాకు కష్టం కలిగించింది. అన్నీ ఇటువంటి పనులేనా? ఇంకో రకంపనే నాకు లేదన్నమాట! అంటే నేను పచ్చి దొంగను అన్నమాట! అందులో అదేవృత్తిగా పెట్టుకొన్న దొంగను!!

ఆమాటమీద కాసేపు ఆవిడతో పోట్లాడాను.

వెధవ చెప్పులవిషయమై కథ ఊహాభారతంలాగ పెరిగి పోతున్నది. సభాపర్వము అయింది. యుద్ధపర్వముకూడా పూర్తియిందు.

ఆ చెప్పులు ఎప్పుడో తీసికెళ్లి వాళ్ళకు ఇచ్చేయ వలసింది. అనవసరంగా నెత్తిమీదికి తెచ్చిపెట్టుకొన్నాను. ఇప్పుడు విచారించి ఏం లాభం!

ఆ తరువాత నాలుగురోజులకు బెజవాడ వెళ్ళాను. రేడియోస్టేషనులో పని అయిపోయింది. ఇక ఆ డక్టరు గారింటికెళ్ళి క్షమాపణ చెప్పుకోవాలె !

ఎట్లా వెళ్ళేది! చెప్పాలుఉంటే తీసికెళ్ళి యిచ్చి 'క్షమించండి ఆలస్యమైనందుకు' అంటే అదోమోస్తరుగా ఉండేది.

నా ఆవిడ అన్నట్లు ఇప్పుడు ఏముఖంతో వెళ్ళేది! కాసేపు ఆలోచించి, ఛీ, ఇక ఈ జన్మకు ఆవైపుకు వెళ్ళే యోగ్యత లేదు. అని అనుకొని, ఇంటికెళ్ళి పోదామని స్టేషను రోడ్డుపట్టాను.

ఆ కాంతయ్య కనపడతాడేమోనని భయం. బిక్కు బిక్కు మంటూ అటూ ఇటూ చూస్తూ నడుస్తున్నాను.

ప్రపంచంలో విచిత్రమైన విషయము ఏమిటి అంటే, ఏది రాకుండా ఉండాలనుకొంటామో అదే వస్తుంది! ఏది జరక్కుండావుంటే బాగుండును అనుకుంటామో అదే జరిగి తీరుతుంది ! ఆ రోజున డాక్టరుగారు కనపడకుండా ఉంటే బాగుండునని వెయ్యి దేవుళ్ళకు మొక్కుకున్నాను. ఆయన కనపడనే కనపడ్డాడు !

ఆయనకారు నా పక్కనుంచి వెళ్ళినపుడే నేను ఆయనను చూశాను. చూచి చటుక్కున తల వంచేసుకొన్నాను. ఆ కారు కాస్తదూరం పోయి ఆగింది.

డ్రైవరు దిగివచ్చి 'మిమ్మల్ని రమ్మంటున్నారండీ, డాక్టరుగారు' అన్నాడు. ఇంకా వెళ్ళకుండా ఎల్లాగుండేది? వెళ్ళాను.

ఆయనను చూచేసరికి నాకు చచ్చినచావు అయింది. విచారంగా ముఖంపెట్టి 'క్షమించండి' అన్నాను. ఆయన నవ్వుతూ 'ఎందుకు?' అని తలుపు తెరిచి చెయ్యి అందిచ్చాడు. ఆదరణతో పలకరించి పక్కన కూర్చోబెట్టుకొన్నాడు. నేను మామూలు పద్ధతిలో కులాసాగా మాట్లాడకపోవటం ఆయనకు కష్టంగా ఉంది కాబోలు.

ఆయన 'ఏమండీ, మీకు వంట్లో ఆరోగ్యంగా లేదా?' అన్నాడు.

'ఆరోగ్యంగా లేకేం. బాగానే ఉన్నాను' అని విచారంగా తలవంచుకొన్నాను.

ఆయన 'ఏదో ఉంది నా మనస్సులో' అని ఊహించుకొని సిగరెట్టు అందిచ్చి ఊరుకొన్నాడు.

తరువాత పదినిముషాలలో కారు ఆయన యింటిముందు ఆగింది. కాఫీ తెప్పించాడు. ఇద్దరం తాగుతున్నాము.

ఒక నిమిషం అయిన తరువాత 'ఏమండీ అల్లా ఉన్నారు? నా ఉత్తరం అందిందా?' అన్నాడు.

కొంప మునిగింది. ఇక చెప్పుల విషయమే వస్తుందనుకొని, ఆయన ఆ విషయమై అడగకముందే చెప్పేస్తే మర్యాదగా ఉంటుందని తల వంచుకొని దీనంగా అన్నాను, 'ఆ చెప్పులు పోయినై అండి' అని.

ఆయన ఏదో విచిత్రంగా, ఏమీ అర్థంకానట్టు చూస్తూ 'ఆ చెప్పులేమిటి! ఏ చెప్పులు?' అన్నాడు.

ఈ చెప్పుల విషయం ఆయన మనస్సులో ఏమీ లేదన్న మాట! నేను అనవసరంగా ఆందోళన పడ్డట్టుంది

అనుకొని జరిగినసంగతీ, నేను మానసికంగా పడ్డబాధ అంతా చెప్పాను.

డాక్టరుగారు విరగబడినవ్వి ఇల్లా అన్నారు. 'అయ్యయ్యో! మీరు అకారణంగా బాధపడ్డారు.'

'మీరు ఈ ఊరు వచ్చినప్పుడల్లా ఇక్కడికి వచ్చి మాతో కాసేపు మాట్లాడి నవ్విస్తూ ఉండేవారు. మీరు రావటం మానేస్తే మాకు కష్టం వేసింది. అందుకని మిమ్ముల్ను రమ్మని గట్టిగా వ్రాశాను. అంతేగాని చెప్పులసంగతి అడగటానికి కాదే! అసలు ఆవిషయము మేము ఎవ్వరూ ఎప్పుడూ అనుకోనేలేదు.

"ఆ రోజున మీరు వెళ్ళిపోయిన తరువాత కాంతయ్యగారు 'నా చెప్పులు కనపడలేదండీ' అని వెతుక్కున్నాడు. మీ అన్నగారు మీరు వదిలేసి వెళ్ళినచెప్పులు గుర్తించి, 'ఇంకేం, మావాడిచెప్పులు ఇక్కడున్నయి. మీవి తొడుక్కెళ్ళి ఉంటాడు. నేను వెళ్ళి చెప్పి పంపిస్తాను లెండి' అన్నాడు."

"కాంతయ్యగారు నవ్వుకొని 'పోనీలెండి. మళ్ళీ తీసుకువచ్చి ఇయ్యాలేటండీ ఈ మహాద్భాగ్యం! ఆ చెప్పులు వారు తీసికొని వెళ్ళటం నాకూ సంతోషమే! ఇది నాభాగ్యం అనుకొంటాను' అని ఎంతో గౌరవంతోనూ ప్రేమతోనూ అన్నాడు. అంతేగాని ఎవ్వరూ ఏమీ అనుకోలేదు. తరువాత ఆసంగతే మరిచిపోయినాము. ఎవ్వరికీ జ్ఞాపకం లేదు – మీరు ఇప్పుడు చెప్పిందాకా!"

యీ మాటలు విని నేనూ సంతోషించాను. ఛీ. ఛీ, ఎంత ఆందోళనపడ్డానా అనవసరంగా అని నాలో నేను నవ్వుకొన్నాను.

అప్పుడు నాకు తోచింది-దీనికంతా కారణము అన్న గారు నాకు చెప్పిన మాటలేకదా అని! ఆయన నాకు కాస్త బాధ కలిగించినమాట నిజమెకాని ఆయన బహుశః నా తెలివి తక్కువతనం నాకే బాగా తెలిసి రావాలని అల్లాగ చెప్పి ఉంటారు.

అన్నగారు నాకు అల్లాగ చెప్పటమూ నేను భయపడ టమూ ఆ విషయాలన్నీ తలుచుకు తలుచుకు నవ్వారు డాక్టరు గారు. చివరకు ఆయన ప్రేమగా నా బుజంతట్టి ఇలనిమిరి, 'మీరు ఇంత పిచ్చివారేమండి! బాగానే ఉందిగాని, ఇక ఆ విషయం మరిచిపోండి. మిమ్ములను గురించి ఎవ్వరుగాని పొల్లుమాట అనలేదు. అంతా గౌరవంగా మాట్లాడారు.'

ఈ మాటవల్ల నాకు కొంచెం తృప్తి కలిగింది. 'కాంతయ్యగారు కూడా పాపం, మీయందు గౌరవంతో మాట్లాడారే కాని మరొకటికాదు. సంతోషించారు కూడా.'

డాక్టరుగారు చెప్పిన సంగతులు అన్నీవిని ఎంతో ఆనందించాను. ఆయనమళ్లీ ఇట్లా అన్నాడు. 'మీరు మన స్సులో ఏమీ కష్టపెట్టుకోవద్దు. ఏదో కాసేపు కులాసాగా మాట్లాడుకొంటాము. మామూలుగా వస్తూ ఉండండి. చెపలు కావలసినప్పుడల్లా వచ్చి పట్టుకెళ్ళండి' అని పకపకా నవ్వాడు.

అదిగో ఆ చివరమాటే నాకు కష్టం కలిగించేది. కావలసినప్పుడల్లా పట్టుకెళ్ళండి అనట మేమిటి! ఒకప్పుడు మాత్రం నేనట్లా పట్టుకెళ్ళినా ఏమిటి? ఏమిటి ఆ మాటలు! అవే నాకు కష్టం కలిగించేవి!

ఈ కథ అందరికీ తెలిసింది. ఆ కాంతయ్యా, డాక్టరు గారూ, అందరికీ చెప్పారు. నవ్వులాటకే చెప్పివుంటారు. అయినా నాకు అప్రదిష్టవచ్చింది.

ఆరోజునుంచి నన్ను అందరూ ఒక విచిత్రవ్యక్తిలా చూస్తూన్నారు. నేను ఎక్కడైనా కూర్చుని మాట్లాడి వెళుతూఉంటే, అవతలవాళ్ళు ఎవరో ఒకరు 'మాస్టారూ, కాస్త మంచిజత చూసుకొని తొడుక్కెళ్ళండి. మళ్ళీ ఏమో. స్తారు' అనడం మొదలుపెట్టారు. నేను వెడుతూ ఉంటే నామీద ఒక కన్ను వేసే ఉంచుతారు - నేను బుద్ధిపూర్వకంగా ఎక్కడబడితే అక్కడ చెప్పులు ఎత్తుకెళ్ళే వాణ్ణేలాగ!

గొడుగు విషయంలోనూ అంతే. చెప్పులు ఎత్తుకెళ్ళే వాడు గొడుగులు ఎత్తుకెళ్ళకుండా వుంటాడా అని అను కొంటారో ఏం కర్మమో! ఎవరూ నమ్మి నాకు గొడుగు ఇవ్వరుగదా, కాస్త అటు వెళ్ళొస్తానండీ అని అడిగితే! ఒకవేళ ఇచ్చినా, 'ఇక అదిరాదు. దానిని ఎక్కడో పారేసి వస్తాడు' అని అనుకొనే ఇస్తారు.

స్కూలులో మాస్టర్లు కూర్చునే గదిలో ఎవరిచెప్పుల జోడుగాని, గొడుగుగాని కనపడకపోతే, 'ఆయన ఎక్క డున్నాడో చప్పున చూడండి' అని ఎవరో ఒకరు అనక

నా జీవితంలో ఒక్కసారి అల్లాంటి పొరపాటుపని చేశాను. మళ్ళీ ఎప్పుడూ చేయ లేదు.

జీవితంలో జరిగిన ఒక్క పొరపాటును ఆధారం చేసుకొని, లోకం నన్ను గురించి ఇల్లాగ అనుకోటం ధర్మమా! ఏదో పొరపాటు జరిగింది అని లోకం నన్ను క్షమించక ఇల్లాగ అనటం అన్యాయంకాదా? ఈ ప్రశ్నకు సమాధానం దొరక లేదు. అది ప్రశ్నగానే మిగిలిపోయింది!

# దొంగ పెద్దమనిషి

ఊళ్ళో దొంగల హడావిడి చాలా ఎక్కువగా ఉంది. గతించిన వారంరోజులలో మరీ చెలరేగి పోయినారు. ఒక్కొక్క రాత్రికి రెండుమూడు ఇళ్ళు సర్దుకొస్తున్నారు. పేటలో వాళ్ళంతా హడలిపోయి ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకొని పడుకొంటున్నారు.

ఎందుచేతో ఏమో, వాళ్ళు మాయింటికి ఇంతవరకు రాలేదు. రాలేదుకదా అని ఇక రారు అనుకొంటానికీ వీల్లేదు. ఎప్పుడో వస్తారు మనవంతు వచ్చినప్పుడు! రాత్రిళ్ళు కాస్త జాగ్రత్తగా వుండటం మంచిది అనుకొన్నాము.

జాగ్రత్తగా వుండటం అంటే ఏమిచెయ్యాలి అని ప్రశ్న వచ్చింది. నేనూ మా యింట్లో అద్దెకున్న రామకృష్ణయ్య గారూ, మా పిల్లలూ, మా ఆవిడా అంతా కూర్చుని, దొంగలు రాకుండా ఉండటానికి ఏమిచెయ్యాలా అని ఆలోచించాము.

ఒక పద్ధతి మేలుకొని కూర్చోటం: ఇది ఎవ్వరూ ఒప్పుకోలేదు. ఒప్పుకోక పోవటానికి రెండు కారణాలు కనపడ్డవి. ఒకటి అసలు, వాళ్ళు మన ఇంటికి రాదల్చుకొన్నారో లేదో. వస్తారని తెలిస్తే మేలుకొని కూర్చోవచ్చుగాని ఆ విషయం గట్టిగా తెలియనిదే, ముందుగానే మేలుకుని కూర్చుంటే, చివరకు వాళ్ళు రాకపోతే మన శ్రమ అంతా వృథాఅయిపోతుంది. పైగా వాళ్ళు మనం మేలుకొనికూర్చోటం చూచి, ఓహోహో ఈ ఇంట్లో ఏదో కాస్తఉంది. లేకపోతే

ఎందుకు తెల్లవార్లూ మేలుకొని కూర్చుంటారు. సరే, సమయము కనిపెట్టి ఈ ఇంటికి మనం వెళ్ళితీరాలని అనుకోవచ్చు. ఇంతవరకు వాళ్ళు మన ఇంటికి రాలేదు బహుశః వాళ్ళు ఈ కొంపలో మనకు దొరికేదేమీ ఉండదూ అనుకొని ఊరుకొన్నారేమో! ఇప్పుడు ఈ జాగరణవల్ల వారికి ఇంకో అభిప్రాయం కలిగితే వాళ్ళను మనం మన ఇంటికి ఆకర్షించినట్లు అవుతుందికదా! కాబట్టి అల్లా చేయవద్దు అన్నారు అంతా.

రెండవ విషయం: మేలుకొని కూర్చోవాలన్నా, ఎన్నాళ్ళని మేల్కోగలము. ఒకరాత్రి మేలుకూర్చుంటే, మర్నాటికల్లా నిద్ర ముంచుకొస్తుంది. కళ్ళు తెరిపిడిపడవు. కాబట్టి ఈ ప్రతిపాదన కొట్టేశాము.

ఇది కొట్టేసినా, ఇంకోప్రపాయం ఏమీ తోచలేదు. చాలాసేపు ఆలోచించాము. ఒక రన్నారూ, 'ఈ యింట్లోకి రాత్రిళ్ళు అనుజ్ఞలేకుండా వచ్చినవారు శిక్షించబడుదురు' అని ఒక కాగితంమీద వ్రాసి గేటుకు అంటిస్తే కొంతలాభం ఉండకపోతుందా అని! దొంగతనము చేయరాదు అని వ్రాసి పెట్టటం మంచిది అని ఇంకొక రన్నారు. దొంగలు ఎప్పుడూ మన అనుమతి తీసుకొనిరారు. దొంగతనము చేయకూడదని వాళ్ళకు తెలిసే చేస్తున్నారుగాని తెలియక కాదు. కాబట్టి ఎల్లాగ వ్రాసినా లాభం లేదని తోచింది.

కాబట్టి ఇంకేదైనా ఉపాయం ఉందేమోనని ఆలోచన చేయవలసి వచ్చింది.

రామకృష్ణయ్యగారు తల గిరాగిరా తిప్పుతూ ఇల్లా అన్నాడు. ''దొంగతనము చేయరాదు – అని నీతులు చెపితే రాకుండా ఉంటారుటండీ. మీాదంతా తెలివితక్కువతనం కాకపోతే! దానికో ఉపాయం ఉంది" అని చిరునవ్వు నవ్వాడు.

ఆ ఉపాయం ఏమిటో చెప్పండి బాబూ – అని మేము ప్రాధేయపడ్డాము. ఆయన అన్నాడూ ''దానికేం లేదు. ఈ ఇంటికి కన్నంవేసి కష్టపడి లోపల ప్రవేశించినా ఏమీా లాభం వుండదు అని వాళ్ళకు తోస్తే వాళ్ళు ఎందుకొస్తారండీ'' అని.

నిజమే ఆమాట. మన యింట్లో ఏమీాలేదని తోస్తే వాళ్ళు ఎందుకొస్తారు? బాగానేవుంది. అయితే అల్లాటి నమ్మకం వాళ్ళకు కలుగజేయటం ఎల్లాగా అన్నది ప్రశ్న అయింది.

దానికీ ఆయనే చెప్పాడు జవాబు. ''ఈ యింట్లో ఉండే వెండి, బంగారు వస్తువులన్నీ బ్యాంకిలో పెట్టాము. ప్రస్తుతం ఏమీా లేవు'' అని వ్రాసిపెడితే మంచిది అని.

ఇది బాగానేవుంది కాని దీనికో చిక్కు వచ్చిపడ్డది. అసలు మనకు బంగారపు వస్తువులే లేవాయెను, ఉన్న కంచాలు రెండూ పూతపూసినవాయెను! అల్లాంటప్పుడు మనకేదో వెండీ, బంగారమూ ఉన్నట్టు అబద్ధమాడి వాళ్ణి ఆశపెట్టటం ఎందుకూ అని! అవి బ్యాంకినుంచి ఎప్పుడొస్తావా అని వాడు ఎదురుచూస్తుంటాడు – అదో తద్దినం తెచ్చిపెట్టుకొన్నట్టు అవుతుంది. అల్లా చెయ్యవద్దని నిశ్చయించుకొన్నాము. ఇల్లాగ అబద్ధం ఆడినా, దీనివలన ప్రయోజనం లేకపోయె!

అయితే ఏం జెయ్యాలె? అబద్ధం ఆడినా దానివలన ప్రయోజనం వుండాలె. ఏ అబద్ధం ఆడితే అల్లాంటి ప్రయోజనం కలుగుతుంది అని మళ్ళీ ఆలోచనచేయగా ఒకటి తోచింది.

"అల్లా అయితే ఒకపని చేయండి. ఈ యింట్లో భయంకరమైన కుక్కలున్నవి. కొత్తమనుష్యులను పీకి చంపుతవి" అని వ్రాసిపెడితే దొంగలు తప్పకుండా భయపడి పోయి ఈ చాయలకు రారని రామకృష్ణయ్యగారు అన్నారు.

ఈ ఆలోచన బాగుందంటే బాగున్నదని అంతా అన్నారు. అల్లాగే వ్రాసి గేటుకు అంటించివేశాము.

ఇక నిర్భయంగా నిదురపోవచ్చునుగదా అని పక్కలు సర్దుకుంటూవుంటే ఇంకో ఆలోచన వచ్చింది. ఇంతాజేస్తే వాడు ఆ కాగితంముక్క చూస్తాడో చూడడో అని!

ఇది కొత్త చిక్కు!

"దొంగదగ్గిర టార్చిలైటు వుంటుంది నాన్నా. వాడు తప్పకుండా చూస్తాడు" అన్నాడు మా పెద్ద అబ్బాయి.

"టార్చిలైటు వుంటుందనకే. ఇక్కడేం వ్రాసివుందీ చూద్దామని బుద్ధిపుడితేగదా వాడు టార్చి వేయటం. అసలు వాడి కా బుద్ధి ఎందుకు పుడుతుంది?" అని చిన్నవాడునవ్వాడు. నిజమే ఆమాట. వాడికి ఎందుకుతోస్తుంది! ఇక్కడ నాకోసం ఏమైనా వ్రాసపెట్టారేమో చూద్దామనుకుంటాడా వాడు? అటువంటి ఆచారం లేదాయె మనదేశంలో!

కాబట్టి ఒక చిన్నదీపం అక్కడ పెట్టటమూ, ఆదీపపు కాంతిలో ఆ నోటీసు కనపడుతూ వుండేలాగున చేయటమూ, అవసరమని తోచింది. వెంటనే ఒక కోడిగుడ్డు లాంపు వెలిగించి

తాటియాకుల గుమ్మటంలో పెట్టి, గేటు దగ్గరగా గన్నేరు కొమ్మకు వ్రేలాడతీశాము. ఇక పరవాలేదు. అసలు ఈ దీనం చూచే దొంగరాడు. వచ్చినా, ఈ నోటీసు చూచి పారి పోతాడు. చూస్తూ, చూస్తూ, చూస్తూ కుక్కలున్న ఇంట్లోకి వచ్చి ఎవరూ ప్రాణంమీదికి తెచ్చుకోరు అని అనుకొని, పక్కలు పరుచుకొన్నాము – నిశ్చింతగా నిద్రపోవటానికి. మొదట అందరమూ ఒకచోట పడుకొందామనుకొన్నాము. కాని అల్లా అయితే పక్కగదిలో వాడు ప్రవేశించి దోచు కొని పోతుంటే మనకు ఏమీ తెలియకుండా పోతుంది. కాబట్టి ఒకొ్కక్క గదిలో ఒకొ్కక్కరం పడుకొంటేమంచిది అని నిశ్చయించాము. మా ఆవిడా, రామకృష్ణయ్యగారి భార్యా, మా పిల్లలూ, అంతా వంటింటి ప్రక్కనున్న గదిలో పడుకొన్నారు. మనకున్న ఆస్తిఅంతా అక్కడున్న చెంబూ, తప్పాలేగా? అందుకని వాళ్ళక్కడ పడుకొన్నారు. పక్కగదిలో నేనూ, వీధివసారాలో రామకృష్ణయ్యగారూ పడుకొన్నాము.

కాని నిదపడుతుందా, చస్తుందా! అనేక ఆలోచన లాయెను? ఇంతాజేస్తే వాళ్ళు ఆ కాగితం చూడరేమో? కుక్కలున్నాయని నమ్ముతారా అసలు? ఈ నమ్మకం కలుగ చేయటం ఎట్లాగా అని ఆలోచించాను.

ఇంతలో రామకృష్ణయ్యగారు పక్కగదిలోనుంచి తలుపుతీసికొని నేనున్న గదిలోకి వచ్చాడు. ఏమండీ! మీకూ నిద్రపట్టలేదా? అన్నాడు.

"ఎట్లా నిద్రపడుతుందీ, ఒక్క విషయమూ తేలకుండా ఉన్నది? మన ఇంట్లో నేమో కుక్కలు లేనాయను. ఆ సంగతి వాడికి ఇదివరకే తెలుసునేమో? వాడొచ్చి "ఏమయ్యా, పెద్దమనిషి వనుకున్నాను, ఇల్లాగ అబద్ధాలు వ్రాశావు! ఇది బాగుందా" అని అడిగితే ఏం జెప్పాలండీ? అన్నాడు.

"ఏం చెప్పటం సంగతి ఎందుకండీ వాడు వచ్చేస్తాడేమోనని భయపడి చూస్తూన్నాను నేనూ" అన్నాను.

"కుక్కలు లేవని తెలిస్తే రాకమానుతాడు టండీ?" అన్నారు ఆయన.

"అయితే ఇక్కడ కుక్కలున్నాయని వాడికి నమ్మకం కలుగజేయటం ఎల్లాగ?" అని అడిగాను.

"అదేనండీ నేనూ ఆలోచించాను. నేను ఒక మాట చెబుతాను - మీరు ఏమీ అనుకోకపోతే ఈ ఇంట్లో కుక్కలున్నట్లు వాడికి తెలియటానికి కుక్కల్లాగ మనం కాసేపు మొఱగటం అవసరం అని నాకు తోస్తున్నది. ఏమంటారు?" అన్నాడు.

ఇది అంత పెద్దమనిషి తరహాకాదు. అయినా ఏంజేస్తాము? ఆపద సమయము; తప్పదు అనుకొన్నాము. ఆసంగతి మా ఆవిడతో చెప్పి, నీవుకూడా యీ విషయంలో సాయపడమంటే, ఆవిడ 'ఛా, ఛా మీరు మొఱగండి కావలిస్తే, నేను మొఱగను' అన్నది. మా పెద్ద అబ్బాయి మటుకు మాతో కలవటానికి సంతోషంతో ఒప్పుకొన్నాడు.

సరేనని ఆయనా, నేనూ, మా అబ్బాయీ కలిసి బైట వరండాలో కూర్చుని కాసేపు అరిచాము. ఎట్లాగయినా

ఇద్దరం చదువుకున్నవాళ్ళం. కళాదృష్టి కలవాళ్ళం. ఇల్లాంటి వాళ్ళు ఏపని చేసినా బాగా చేస్తారన్న మాట నిజము. రెండు కుక్కలు పోట్లాడుకొంటున్నట్లు, దెబ్బతిని ఏడుస్తున్నట్లు, భయంతో మొరుగుతున్నట్లు, కోపంతో గర్జిస్తున్నట్లు, రకరకాలుగా అరిచాము కాసేపు. మర్నాడు తెలిసింది అంతా చెపితే, అచ్చంగా కుక్క అరుపుల లాగే ఉన్నాయట మా అరపులు. ఒకాయన అన్నాడుకూడా "ఏమీా భేదం లేదండీ నిజంగా కుక్కలే అరుస్తున్నాయి అనుకొన్నాము. ఆమాట కొస్తే కుక్కలకంటేకూడా బాగా మొఱిగారు మీారు. అంత చక్కగా అందరూ మొఱగగలరనా? ఎబ్బే! ఏజన్మానో మీారు కుక్కలై ఉండాలి. లేకపోతే అంతచక్కగా రాదనుకోండి." అని మాకు నమ్మకంగా చెప్పాడు. ఏమో? నిజమేమో? కాదని ఎవరు అనగలరు. ఆ పూర్వజన్మవాసనే మాకు అల్లాంటి బుద్ధి పుట్టించిందేమో?

ఈపని పూర్తి అయ్యేసరికి రాత్రి రెండు కావస్తున్నది. నిద్ర ఆపలేకుండా ఉన్నాము. అందుకని వెంటనే పడుకొన్నాము ఇక దొంగలొస్తారని భయం లేదనే నమ్మకంతో.

*　　　*　　　*

అప్పటికి రాత్రి రెండు గంటలు అయి ఉంటుంది. వెంటనే నిద్రపట్టింది. కొంతసేపటికి దొడ్డితలుపుదగ్గర ఏదో చప్పుడైనట్లు తోచింది! లేచి వెళ్ళిచూశాను. అక్కడ ఎవ్వరూ లేరు. మళ్ళీ వచ్చి పడుకొన్నాను. పడుకున్నానన్న మాటేగాని, నిద్రపడుతుందా ఏమన్నానా! ఏదో భయమూాయె! మన ఇంట్లో వెండీ బంగారము లేనుకదా; వాడు

వచ్చి ఎత్తుకుపోయేది ఏముందిలే అని మనస్సుకు ధైర్యం చెప్పుకొన్నా, మళ్ళీ ఆ ఉన్న చెంబూ తప్పాలా కాస్తా ఎత్తుకుపోతాడేమో నని భయం. అది చాలదూ మన ప్రాణానికి ? మళ్ళీ కొనుక్కోగలమా ? ఏమన్నా నా ?

ఎట్లాగో మళ్ళీ కాస్త కునుకుపట్టింది. గదిలో ఎవరో నడుస్తున్నట్లు అలికిడి అయి లేచాను. చీకటిగా ఉంది. దీపం లేదు కాని కొద్దిగా కనబడుతున్నది. కళ్ళు బాగా తెరిచి చూద్దునుకదా, ఓమూలనుంచి ఎవరో మనిషి నావైపు నడిచి వస్తున్నాడు. ఇంకేముంది ? కొంప మునిగింది ? దొంగ రానేవచ్చాడు ?

'ఎవరువారు ?' అన్నాను.

'నేనే, అరచబోకు' అన్నాడావ్యక్తి, నన్ను చాలా కాలంనుంచి ఎరిగి ఉన్న వాడిలాగ.

"నేనే అంటే, ఎవరునీవు"

"చెబుతాను. కొంచెం మెల్లగా మాట్లాడు."

"దొంగవేనా"

"అవును"

"ఎందుకొచ్చావు ?"

"ఎందుకొచ్చానో తెలియదేం ? ఎబ్బే, నిన్ను చూసిపోదామని వచ్చాను. అంతా కులాసాగా ఉన్నారా ?" అని అడిగాడు దొంగ కొద్దిగా మందహాసంచేస్తూ.

వీడు ఎవడో సామాన్యపుదొంగగా లేడు. దొంగతనానికి వచ్చి క్షేమ సమాచారం అడుగుతున్నాడు. చాలా ఆశ్చర్యంగా ఉంది అనుకొన్నాను.

యెట్లావచ్చాడు?

"యెట్లా వచ్చావూ?"

"దొడ్డివాకిలి తలుపు గడియ యెత్తేసి వచ్చాను. అయినా ఆ సంగతులన్నీ నీవు అడగకూడదు"

"కుక్కలున్నవి, పీకి చంపుతవి - అని వ్రాసిఉన్న నోటీసు చూడలేదా?"

"చూడకేం - చూశాను. అంతకుముందు వాటి అరుపులూ విన్నాను!"

"మరి...కరుస్తవి అనుకోలేదూ?"

"అరిచేకుక్కలు కఱవవు అని నాకు తెలును. అది కాక ఆ కుక్కలు మధ్య మధ్య మాట్లాడుకోవటంకూడా విన్నాను" అని మళ్ళీ నవ్వాడు ఆ పెద్దమనిషి.

వీడెవడో అసాధ్యుడు. మన గుట్టుఅంతా కనిపెట్టాడు. యెట్లాగు వీడిని వదిలించుకోటం? పైగా వీడు, తనపని తాను చేసుకుపోక ఇంట్లో ఉన్నవారితో కబుర్లలోకి దిగాడు! యెట్లా వీడితో వేగటం? అనుకొని, యెందుకైనా మంచిదని రామకృష్ణయ్యగారిని పిలవబోయాను.

"యెవరిని పిలుస్తున్నావు" అని కళ్ళు యెఱ్ఱజేశాడు ఆ దొంగ.

"మరేం భయంలేదు. మనవాడేలే! మనకు మంచి స్నేహితుడు" అన్నాను నేను.

"అల్లా అయితే వెళ్ళి లేపి పిలుచుకురా గాని - కేక వేస్తావేం తెలిసినక్కవగా?" అన్నాడు ఆయన. 'సరే, అని నేను చప్పుడు చేయకుండా అడుగులో అడుగు వేసుకొంటూ

వెళ్ళి రామకృష్ణయ్యగారిని లేపి "మీరు చప్పున రావాలి ఆ గదిలోకి. వచ్చింది దొంగే కాని చాలా విచిత్రమైన వ్యక్తి. మంచివాడు కూడాను." అని చెప్పి తీసుకొచ్చాను. తీసికొచ్చి ఆయనతో అన్నానూ, ఆ కొత్తవ్యక్తిని చూపిస్తూ, 'ఇదిగో, ఈయన మన ఇంటికి వచ్చాడు చాలా యోగ్యుడు' అని.

రామకృష్ణయ్య నమస్కరించి, 'మీ రేనా దొంగ గారు? చాలా సంతోషం. మీరు వస్తారని అనుకొంటూనే ఉన్నాము రెండురోజులనుంచి' అన్నాడు.

దొంగ జవాబుగా చిరునవ్వు నవ్వాడు.

"కూర్చోండి" అన్నాడు రామకృష్ణయ్య. అతనిని కబుర్లలోకి దింపి, కాలయాపన చేసి పంపిద్దామని మా మాస్టారుగారి ఎత్తు వాడు ఆ విషయంలో మనకంటే నాలుగు ఆకులు ఎక్కువే చదివాడు. "కూర్చుంటానికిటయ్యా మీ యింటికొచ్చింది?" అని ఉరిమి చూశాడు.

"తమవంటివారు మాబోటి బీదవాళ్ళయింటికి ఎందు కొస్తారండి! మరి!" అన్నాడు రామకృష్ణయ్యగారు.

దొంగ కొంచెం విసుగ్గా - "ఈ మాటలన్నీ కట్టిపెట్టి నీ ఆస్తి ఎక్కడుందో చెప్పు?" అన్నాడు యముడులాగ.

నే నేదో చెప్పబోతూంటే రామకృష్ణయ్యగారు నా మాటకు అడ్డొచ్చి, నన్ను చెప్పనియ్యక "మాకున్న ఆస్తిఅంతా అదిగో ఆ గదిలో ఉన్నది"అని వంటిగైపు చూపాడు.

ఆ దొంగ "మీ రిద్దరూ, ఇక్కడే ఉండండి. కదిలినా, కేక వేసినా, మాటదక్కదు, ప్రాణాలు దక్కవు" అని కత్తి చూపాడు.

రామకృష్ణయ్యగారు నవ్వుతూ, "అల్లాంటి పిచ్చిపని ఏమీ చెయ్యము. మీరు నిర్భయంగా వెళ్ళి పని చక్కబెట్టు కొండి" అన్నాడు. దొంగ ఆ మాటలు నమ్మి వంట యింట్లోకి వెళ్ళాడు. ఇక మేమిద్దరం మాట్లాడుకొన్నాము.

"ఆ పాత్రసామాగ్రి అంతా జేరేస్తాడేమో!"

"అల్లాంటి వాటికి ఆశపడేరకం అయితే మీతోనూ, నాతోనూ మాట్లాడడు. వీడుకొంచెం ఘరానాదొంగ. మీరు మాట్లాడబోకండి. నేను వీడితో కాసేపు తమాషా చేస్తాను" అన్నారు రామకృష్ణయ్యగారు.

మేము ఇంకా గుసగుస లాడుతూనే ఉన్నాము. వాడు అప్పుడేవచ్చి "ఆయింట్లో ఏమున్నయి నాబొంద, అంట్ల బొచ్చెలు తప్పితే?" అన్నాడు విసుగ్గా.

"మా ఆస్తి అంతా అదేను బాబూ" అన్నాను నేను.

"అంతకంటే మా కొంపలో ఇంకేమీ లేవు. అవి తీసుకెళ్ళండి కావలిస్తే — దయఉంటే ఆ దబరాగిన్నె మాత్రము వదిలేసి వెళ్ళితిరా రేపుపొద్దున వండుకుతింటాము" అన్నాడు మాస్టరుగారు నవ్వుతూ.

"మీ వెధవ పాత్ర సామగ్రికోసం ఆశపడే వాడినికాదు నేను" అని కచ్చితంగా చెప్పేశాడు ఆ మనిషి.

"నీవు అల్లాంటి వాడవనే మేమూ అనుకున్నాము. కాని ఏంజేస్తాం. మాకున్న ఆస్తే అది. ఏదో ఒకటో రెండో

తీసికొని మమ్మల్ని కృతార్థులనుచేసి వెళ్ళాలె మీరు. బొత్తిగా వద్దంటే ఎట్లాగు?'' అన్నాడు మా రామకృష్ణయ్య వినయంగా.

ఈ మాట విని ఆ మనిషి. "నీవు పరాచకం ఆడితే వింటూ కూర్చుంటాననుకొన్నావా? ఆ పప్పులు ఉడకవు. మీ ఇంట్లో ఏమైనా ఆస్తి ఉందేమో చెప్పు'' అన్నాడు.

"ఇంకేముందండీ?'' అన్నాను నేను.

"ఆ పెట్టెలలో?''

"మా ఆడవాళ్ళ చీరెలూ, మా ధోవతులూ చొక్కాలు ఉన్నవి. అవైనా పాతవీ, చినుగుపట్టినవీ,! కావలిస్తే పెట్టెలు తెరిచి చూపిస్తాను'' అన్నాను.

దొంగ విసుక్కొని "వెండీ బంగారం ఏమైనాఉంటే బయటపెట్టు - ఊరికే సోదిపెట్టక''అన్నాడు.

"వెండి, బంగారాలు మా యింట్లో ఎక్కడివండి? నాగపోతరావు షావుకారింటికి వెడితిరా మీకు పుష్కలంగా లభిస్తవి. కావ ంటే మీకు ఆయిల్లు చూపిస్తాను'' అన్నాడు రామకృష్ణయ్యగారు.

దొంగకు ఈమాటలేమీ రుచించలేదు. ఆడవాళ్ళ వంక తిరిగి, మర్యాదగా "మీ మెళ్లో సొమ్ములేమీ లేవమ్మా అమ్మాయ్!'' అన్నాడు.

ఇందాకటనుంచి అక్కడే నుంచుని మా సంభాషణ అంతా వింటూఉన్న మా ఆవిడ ఈ దొంగయొక్క యోగ్యతను గురించి తెలిసికొన్నది కాబట్టి ధైర్యంగా, "అయ్యో! అయ్యో! అంతమాత్రం కూడానా అన్నయ్యా! మీ బాప

సంపాదన తిండికే సరిపోవటంలేదు. సొమ్ములు చేయించటానికి ఎక్కడిది'' అన్నది.

ఆ మనిషి దొంగఅయినా కాస్త సహృదయం కలవాడు. మా ఆవిడ మాటలు విని జాలిపడి, నావైపు తిరిగి, ''పెళ్ళానికి సొమ్ములు చేయించుకోరటయ్యా? సంపాదిస్తున్నావు, మహాగొప్ప సంపాద్యము'' అంటూ నాలుగు చీవాట్లు వేశాడు. నేను బిక్కముఖంపెట్టి నుంచున్నాను, తప్పు నాదే అన్నట్లు. నాముఖంచూసి మా ఆవిడకే జాలివేసింది కాబోలు, ఆవిడఅన్నది. "మీ బావమటుకు ఏంజేస్తారన్నయ్యా? రోజులు అల్లాంటివి?" అని.

అతనుకూడా కాస్త మెత్తపడి, "అవ్వననుకో. అయినా ఆడపిల్లను బోసిమెడతో అట్టిపెడతాడటమ్మా ఎవరైనా? తప్పుకాదూ?" అన్నాడు ముక్కుమీద వేలువేసుకొని.

దొంగగారు చాలా పెద్దమనిషిలాగ ప్రవర్తించారు, ఇంతవరకు. ఎవరిమీదనూ చెయ్యి చేసుకోలేదు. మాయింట్లో ఏమీలేదని అతనికి కొంతవరకు నమ్మకం కలిగింది. కాని ఇంకా అనుమానం పీకిస్తున్నట్లుంది. అందుకని ఇల్లంతా కలియజూచి, తెల్లటి కంచాలవైపు చూపుతూ, "అవి వెండి కంచాలు కావుటయ్యా," అన్నాడు.

"కావు అన్నయ్యా, అవి గిల్టువి. నీ కెందుకూ?'' అని నవ్వుతూ అన్నది మా ఆవిడ.

చాలా ఆలస్యం అయిపోయిందని దొంగ అనుకొంటూ ఉన్నట్లు అతని ముఖమే చెప్పుతున్నది. అతనికి అనుమానం కూడా పోయినట్లు లేదు.

ఆ మనిషి కాసేపు ఆలోచిస్తూ నుంచుని అటూ, ఇటూ చూచి చివరకు, "అయితే వెండీ, బంగారం, డబ్బు అటువంటిది ఏమీ లేదంటారా?" అన్నాడు కచ్చితంగా చెప్పమన్నట్లు చూస్తూ.

'లేదండీ' అని తెగేసి చెప్పాము – మేమంతా ఏక కంఠంతో.

"ఎందుకు లేదయ్యా! మీరు ఇద్దరూ సంపాదిస్తున్నారు కదా? నేను నమ్మను. ఎక్కడో దాచారు? ఉండకుండా ఉంటుందా యింత ఇంట్లో? వెతుకుతాను' అన్నాడు.

"వెతుక్కోండి" అన్నది మా ఆవిడ ధైర్యంగా. వెండీ, బంగారంతప్ప ఇంకొకటి పుచ్చుకోడు ఈ మనిషి. అల్లాంటివి ఏవీ, మన యింట్లో లేవు. కాబట్టి వెతుక్కో మన్నాం. మరేమీ భయంలేదనితోచి, నేను మంచంపైన నిశ్చింతగా నడుము వాల్చాను.

"పోయిన రాత్రి మేలుక్కూర్చున్నాము, నిద్రముంచు కొస్తున్నది. నేనుకూడా పండుకొంటాను. వెళ్ళేటప్పుడు కాస్త చెప్పివెళ్ళవయ్యా తలుపు వేసుకొంటాము," అన్నాడు రామ కృష్ణయ్యగారు మత్తుగా.

"వచ్చినదారినే వెళ్ళు అన్నయ్యా" అన్నది మా ఆవిడ.

దొంగ ఈ మాటలు విని, ఆలోచనలో పడ్డట్టున్నాడు వెతుకుదామా వద్దా అని? వెతికినా లాభంలేదని తోచిం దేమో అతనికి? లేకపోతే ఎందుకు అల్లాగ నిలబడి ఊరు కొంటాడూ తనపని తాను చేసుకోక?

రామకృష్ణయ్యగారు లేచి దీపం "వెలిగించబోయినాడు.

దొంగ "వెలిగించకు, నేను వెతుక్కుంటానులే" అన్నాడు.

రామకృష్ణయ్యగారు నవ్వుతూ "వెలిగించ నియ్య వయ్యా, ధనం ఎక్కడుందో, వెతుకున్నావుగా? నీతో పాటు నేనుకూడా వెతుకుతాను నీకు సాయంగా" అన్నాడు.

"ఏమీ లేదన్నావుగా నీవు?"

"అన్నాను. అన్నాను కాని ఇంతయింట్లో ఉండక పోతుందా అని నీవు అన్నతరువాత, నాకూ అనుమానంగానే ఉంది ఎక్కడైనా ఉందేమోనని!" అన్నాడు రామకృష్ణయ్య గారు.

'సరేలే పడుకో' అని దొంగ విసుక్కున్నాడు. తనను కూడా వెతకనియ్యనందుకు విచారపడుతూ కుర్చీలో కూల పడ్డాడు మా మాస్టరుగారు. నేను కూడా లేచి కూర్చు న్నాను. మా ఆవిడా వాళ్ళు ప్రక్కగదిలోకి వెళ్ళిపోయి నారు. రెండు మూడు నిమిషాలు గడిచింది.

దొడ్డితలుపు విసిరివేసిన శబ్దం అయింది! 'అతడు వెళ్ళిపోయినాడు?' అన్నాను నేను. 'వెళ్ళాడు' అన్నాడు రామకృష్ణయ్యగారు.

రామకృష్ణయ్యగారు ఆలోచిస్తూ ఉన్నట్లు కనబడ్డది. "ఏమిటండీ అంతగా ఆలోచిస్తున్నారు?" అన్నాను.

ఆయన వెంటనే జబాబివ్వక తీవ్రంగా ఆలోచించి చివరకు "ఈ దొంగ చూశారూ! సామాన్యుడుకాడు. ఘరానామనిషి. వెండి బంగారం తప్ప ఇంకొకటి తీసుకోడు.

కాబట్టి అవి ఎక్కడున్నదో తెలిసికోటంలో చాలా అను భవం ఉండి ఉండాలె. ఏమంటారు ?" అన్నాడు.

"అవును. నిజమే" అన్నాను నేను.

"అవునా. అల్లాంటి తెలిసిన మనిషి 'ఈ యింట్లో బంగారం ఎక్కడో ఉండే ఉంటుంది' అని ఊరికే అనడు. ఉండేఉంటుంది. అతనికి వ్యవధి లేక వెళ్ళిపోయిఉంటాడు. పోనీ మనం వెతుక్కుందామా, ఏమిటి' అన్నాడు" కను బొమ్మ లెగ రేస్తూ ఆశగా.

సరే అన్నాను నేను ఆయన మాటలయందు అంతగా విశ్వాసం లేనట్లు చూస్తూ. ఇప్పుడు మా యింటికి మేమే దొంగలమైనాము.

వెతుకుతున్నాము, వెతుకుతున్నాము, ఎక్కడన్నా వెండీ బంగారమూ ఉండకపోతుందా అని! ఇంతవరకు ఏమీ కనుపించలేదు. కాని 'ఎక్కడో ఉండకపోతుందా' అని వాడు ఊరికే అంటాడా ! వాడికేదో వాసనకొట్టే అని ఉంటాడు. ఎప్పటికైనా దొరకవచ్చునని ఆశగాఉంది.

# నిజం కోసం

తహసిల్దారుగారు ప్రచండుడు. గుమాస్తాల చేత గట్టిగా పని చేయిస్తాడు. బహు నిక్కచ్చి మనిషి. న్యాయంగానూ ధర్మంగానూ ప్రవర్తిస్తాడనీ కాస్తకూ కూస్తకూ చెయ్యిచాపే స్వభావం కలవాడు కాదనీ ప్రతీతి.

గుమాస్తాలకు ఆయనంటే హడలు. ముఖ్యంగా ఎవరికైనా సెలవు కావలసివస్తే ఆయన దగ్గరకు పోవటానికి భయం. ఎవరైనా సాహసించి పోయి అడిగినా ఆయన ఇయ్యడు. పైగా ఏదో కారణం చూపి చీవాట్లు పెట్టి పంపిస్తాడు.

ఏ గుమాస్తాకైనా సెలవు కావలిస్తే అతనికి అమాంతం టైఫాయిడ్ జ్వరం అన్నా వస్తుంది; తండ్రి రైలు క్రింద అయినా పడిపోతాడు. లేకపోతే తల్లికి ప్రాణం మీదికి అయినా వస్తుంది. అంతేకాని మామూలుగా పనిఉంది అనిగాని, పుట్టింటఉన్న భార్యను చూచి వస్తాననిగాని వ్రాస్తే సెలవు దొరకదు.

గట్టి కారణం చెప్పినా కూడా ఆ చెప్పిన విషయం నిజమా అబద్ధమా అని ఆయన రహస్యంగా విచారణ చేయటం కూడా ఉంది. కాబట్టి ఆయనతో అబద్ధం చెప్పవలసి వచ్చినపుడు చాలా జాగ్రత్తపడి దాన్ని అభేద్యమైన దాన్నిగా చెయ్యాలె.

ఆ ఆఫీసులో మొన్న మొన్ననే ప్రవేశించిన ప్రసాదుకు ఈ వ్యవహారం అంతా తెలియదు. అందుకనే అతడు మామూలు అబద్ధం ఆడి ప్రాణంమీదికి తెచ్చుకొన్నాడు.

ప్రసాద్ బొత్తిగా చిన్నవాడు. పాతికేళ్ళకు లోపు. కులాసాగా ఉంటాడు. టీకుటాకుగా దుస్తులు వేసుకొని ఆఫీసుకు వస్తాడు.

ప్రసాద్ ఆఫీసుకు వచ్చిన రోజునే అంతా అనుకొన్నారు, 'ఎబ్బే, తాలూకా గుమాస్తా పనికి ఇతను పనికిరాడూ' అని. లేకపోతే ఆ టీవి ఏమిటి? తాలూకా గుమాస్తా అంత టీవిగా నడవటం ఇంతవరకు ఎవ్వరూ చూడలేదుట. తహసీల్దారులూ, డిప్యూటీ కలక్టరులూ నడిచే నడక అది. తన కెందుకూ.

తలవంచుకొని మాట్లాడటంవల్ల వినయమూ, నమ్రతా గల మనిషేమోనని అనిపిస్తుంది కాని అమ్మో, అదంతా దొంగవేషం అని హెడ్ గుమాస్తా అప్పుడే కనిపెట్టి అందరితోనూ రహస్యంగా చెప్పేశాడు.

ఆఫీసులో అన్ని మూలలా అతనిని గురించి గుసగుసలు బయలుదేరినవి. మొత్తంమీద అంతా కలిసి అనుకొన్నది ఏమిటీ అంటే, ఇతనేమీ ఉండేరకం కాదని.

* * *

ప్రసాద్ ఉద్యోగంలో చేరిన నెలలోపున ఓరోజున ఆవూళ్ళో టెన్నిస్ పందాలు పెట్టారు. గొప్ప గొప్పవాళ్ళంతా వస్తున్నారు. ప్రసాద్ టెన్నిస్ కాస్త బాగానే ఆడతాడు. ఆడటం ఎల్లాగున్నా టెన్నిస్ అంటే అతడు చెవి కోసుకొంటాడు. ఆరోజున వెళ్ళిచూడాలె. ఆఫీసరు సెలవ్వఇయ్యడు. ఎల్లాగ వెళ్ళటం? అదీ సమస్య!

ప్రసాద్ ఆరు రూపాయలు పెట్టి టిక్కెట్టు కొన్నాడు – ఆ సంగతి మాత్రం ఎవ్వరికీ తెలియనివ్వలేదు. రెండు రోజులు ఇట్టే గడిచిపోయినయి. ఇక ఆరోజు సాయంత్రమే ఆటలు ప్రారంభం. మూడు గంటలకల్లా తాను అక్కడ ఉండాలె.

ప్రసాద్ ఇల్లా అనుకొన్నాడు. తాను వెళ్ళకపోతే ఏమీ మర్యాదగా ఉండదు. తన బాధ ఎల్లాగున్నా అందరూ ప్రసాద్ ఏడీ ప్రసాద్' ఏడీ అని అడుగుతారు. తాను లేకపోతే వాళ్ళంతా, 'ఛీ! ప్రసాద్ లేకపోతే ఆడటానికి మాకేం ఉత్సాహంగా ఉంటుంది' అని అంటారు కూడాను. వాళ్ళు అనుకోటం ఎల్లాగున్నా తాను మాత్రం ఆటచూడకుండా ఎట్లా ఉండగలడు? ఏదో కారణం చెప్పి ఒంటిగంట కల్లా సెలవు సంపాదించి తీరాలని నిశ్చయించుకొని మరీ వెళ్ళాడు ఆఫీసుకు ఆ రోజున ప్రసాద్.

బల్లదులిపి కుర్చీలో కూర్చున్నాడు. ముందు 'ట్రే'లో కాయితాలు బోలెడు ఉన్నయి. వాటి నన్నిటినీ సమాదరణ చేసి పంపేసెయ్యాలె. ఇప్పుడ దయ్యేపనా అది?

ఒక కాయితం తీశాడు, బందిలదొడ్డిలో గేదె ఒకటి చచ్చిపోయిందట? తీసి పారవేయటానికి అనుమతికోసం వ్రాశాడు ఒక ఊరి కరణం. చచ్చినగేదెను ఈడ్చి అవతల పారెయ్యటానికి తహసీల్దారుగారి అనుమతి ఎందుకో? ప్రసాద్‌కు ఈ పద్ధతి అంటే అసహ్యం కలిగింది.

ఇట్లాగే ఉంటయ్యి ఆ కాగితాలన్నీ అనుకొన్నాడు. మంచిదుస్తులు వేసుకొని కుర్చీలో కూర్చుని పేరుపొందిన ఆటగాళ్ళ టెన్నిస్ ఆటచూస్తూ ఆనందించవలసిన తనకు

ఈ కాగితాలు చూడవలసిన కర్మం పట్టింది. ప్రసాద్ చాలా విచారపడ్డాడు.

అప్పుడే ఒంటిగంట కావస్తున్నది. ఈ పాటికి టెన్నిస్ కోర్టులో జనం కిటకిటలాడుతూ ఉంటారు. ప్రాణం పీకుతున్నది వెళ్ళాలని. ఎల్లాగ వెళ్ళటం? ప్రసాద్ ఆలోచించాడు.

నిజం చెబితే ఆఫీసరు పోనియ్యడు ?

ఏదో అబద్ధం చెప్పాలె.

ఏమి చెబుదామా అని ప్రసాద్ తీవ్రంగా ఆలోచించాడు. చిన్నతనంలో తాను విద్యార్థిగా నున్న రోజులలో సెలవు కావాలంటే ఏదో అబద్ధం చెప్పి క్లాసులోనుంచి వెళ్ళి పోయిన రోజులున్నయి. కాని అప్పుడు ఏ అబద్ధం చెప్పినా తీరిపోయేది. కణతలు నొక్కిపట్టుకొని 'తలనొప్పి అండీ మాస్టారూ' అంటే పాపం ఆయన 'ఇంటికెళ్ళి పడుకో, పో' అని చెప్పి పంపేసేవాడు. పాఠశాలలో ఉపాధ్యాయులతో చెప్పే అబద్ధాలు ఇక్కడ ఏమీ పనికివచ్చేటట్లు లేదు.

ఆ ఉపాధ్యాయులైనా గట్టి అబద్ధాలను ఎట్లాగ కట్టాలో తనకు నేర్పలేదు. ఎంతసేపటికీ 'నిజం చెప్పు, నిజం చెప్పు' అనే వాళ్ళు. నిజం చెప్పటమే అలవాటు అయినవాడు, ఈ ప్రపంచంలో ఎందుకూ పనికిరాడు. కాకపోతే మళ్ళీ ఆ బడిపంతులు పనే చెయ్యాలి. అందుకు మాత్రం పనికి వస్తాడు!

ప్రసాద్ కాగితాలు అవతలకు నెట్టి తల అరచేతులలో ఆనించి, సెలవు సంపాదించటానికి ఏమి చెబుదామా అని మళ్ళీ ఇంకొకసారి గట్టిగా ఆలోచించాడు. ఏమీ లాభం

లేకపోయింది. ఏమైనా ఆలోచనశక్తిగా? ఛీ, తన చదువంతా ఎందుకూ పనికిరాకుండా పోయింది?

తళ్ళికోట యుద్ధానికి నాలుగు కారణాలు వ్రాయి అని అడుగుతారు పరీక్షలలో. ఆ కారణాలు ఏవో కూడా నేర్పుతారు. తన కిప్పుడు నాలుగు కాదు; పధ్నాలుగు కారణాలు వచ్చు. కాని ఎందుకొచ్చిన చదువు అది? సెలవు సంపాదించటానికి ఆఫీసరుతో ఆడవలసిన నాలుగురకాల గట్టి అబద్ధాలు నేర్పి ఉన్నట్లయితే తన కిప్పుడు ఎంతో ఉపయోగంగా ఉండేవి.

ప్రసాద్ విసుగుతో అనుకొన్న మాటలుకావు ఇవి. హృదయపూర్వకంగానే అల్లాంటి చదువు తాను నేర్చి ఉన్నట్లయితే ఎంతో బాగుండేది అని అనుకొన్నాడు. సరే, ఇప్పుడు తాను తన తెలివితేటలను ఉపయోగించే మాంచి కారణాన్ని ఒకదానిని కనిపెట్టాలె.

ఒంటిగంట అయింది, కాని ప్రసాద్‌కు చెప్పదగిన కారణం ఏమీ తట్టలేదు. 'తల నొప్పిగా ఉంది. ఇంటికి వెళ్ళి పడుకొంటాను' అనాలని తోచింది కాని – ఇంకొక కారణం తోచందే చచ్చి! ! ఎవరినైనా అడిగి తెలుసుకొనే విషయం కూడా కాదాయె ఇది?

* * * *

తలనొప్పిగా ఉందంటే, ఆఫీసరు ఒక సారిడాన్ మాత్రా, ఓ కప్పు కాఫీకూడా ఇచ్చి 'కాసేపు రికార్డురూములో పడుకో. తగ్గిపోతుంది' అంటాడు. లాభంలేదు. ఇక ఏదైనా జబ్బును పట్టుకురావాలె. తాను వచ్చి నెల అయినా కాలేదు.

ఆ రామారావు వచ్చిన రోజున ఆఫీసుకు పోకుండా అతనితో కులాసాగా కాలక్షేపం చెయ్యటానికి బంక విరోచనాలు వచ్చినయ్యి. మరో రోజున కడుపునొప్పి రానే వచ్చె! ఇంకా ఏంజబ్బు లున్నయో కూడా ప్రిసాదుకు జ్ఞాపకంరా లేదు. చెవులో పోటు ఒకటి ఉంది కాని, దాన్ని ఉంచుకోవాలె, ఎప్పుడైనా మరీ అవసరంవస్తే వాడు కొంటానికి.

ఇక పోతే ఇంకా మంచిమంచి జబ్బులు ఏమున్నాయా అని ప్రసాద్ గట్టి ఆలోచనే చేశాడు. కాని సమయానికి జ్ఞాపకం వచ్చి చావందే? ఛీ, ఛీ వెధవ సంగతులన్నీ ఇట్టే జ్ఞాపకానికి వస్తయి, పానిపట్టు యుద్ధానికి కారణాలు, అటహాబాదు సంధి షరతులూ ఇవన్నీ? కాని తనకు అత్యవసరమైన విషయాలు జ్ఞాపకానికి రావాయె? పోనీ అకారాది జబ్బుల పట్టిక అయినా ఒకటి ఉంటే బాగుండును అనుకొన్నాడు ప్రసాద్ ఆ సమయంలో.

అయినా అతడు ప్రయత్నం చేశాడు 'అ' దగ్గరనుంచి 'హ' దాకా ఉన్న అక్షరాలతో ప్రారంభం అయ్యే జబ్బులు ఏవి అవి? ఈ ప్రయత్నంలో అతడు విఫలుడై నాడనే చెప్పాలె.

కొన్ని అక్షరాలు మాత్రమే జబ్బు అక్షరాలు, 'అ' అజీర్ణం. 'ఆ' మీద జబ్బు ఏమీ కనపడ లేదు. 'అ' అక్షరం వది లేయాలి. ఇట్లాగ ఎన్నో అక్షరాలు వది లేయాలిసి వచ్చింది. 'ఉ' మీద ఉన్మాదం ఉంది. అయి తేనేం? తనకు పనికివచ్చేది కాదు అది? 'ఎ' మీదఉన్న ఎక్కిళ్ళు అంతే. 'ఏఐ' ఒక, 'ఓ' 'ల' మీద జబ్బులేమీ లేవు. అచ్చులన్నీ ఇట్లాగే ఏడ్చినయి. తరువాత హల్లులుమీద కాస్తనయమే.

పైత్యం, వికారం, డోకులు, వాంతులు, నంజు, జలోదరం మొదలైనవి ఉన్నవి. కాని తనకు ప్రస్తుతం అక్కరకు వచ్చేవి మాత్రం కావు. ప్రసాదు చాలా చికాకుపడ్డాడు కణతలు నొక్కుకుంటూ అల్లాగ దిగాలపడి కుర్చీలో కూర్చున్నాడు. పాపం, అతని అవస్థను తలచుకొంటే ఎవరికైనా జాలికలుగుతుంది. సెలవు సంపాదించటానికి ఒక్క కారణం దొరక్కపోయెనే పాపం ఈ చిన్నవాడికి?

* * *

ఒంటిగంటన్నర అయింది. ప్రసాద్ కుర్చీలోనుంచి లేచి అడుగులో అడుగు వేసుకొంటూ వెళ్ళి ఆఫీసరుముందు నిలబడ్డాడు, సెలవు అడగటానికి.

ఆఫీసరు మంచి సంతోషంతో ఉన్నారు. ఆయన ప్రసాదును చూచి ఆహ్వానపూర్వకంగా చిరునవ్వు నవ్వి ఏంకావాలన్నాడు. ప్రసాదు మాట్లాడలేదు.

మాట్లాడక క్రిందిచూపులు చూస్తూ బిక్కముఖంతో నిలబడ్డాడు.

ఆఫీసరు ఇల్లాంటి వాళ్ళను ఎంతమందినో చూచిన అనుభవజ్ఞుడు. సంగతి ఇట్టే గ్రహించి, సెలవు కావాలా? అని అడిగాడు. ప్రసాదు చిరునవ్వుతో అదేసంగతి అన్నట్లు తల ఊపాడు.

ఎందుకూ? అని అడిగాడు ఆఫీసరు. ప్రసాదు దుఃఖంతో 'మా ఆవిడ...........' అని ఆ వాక్యం పూర్తిచేయలేక పోయినాడు. 'ఆ ఏమిటయ్యా, మీ ఆవిడకేమిటి చెప్పు? అని అడిగాడు ఆఫీసర్. ప్రసాదు వంచిన తల ఎత్తకుండా కంఠ

గాద్గ్యంతో 'నొప్పులు వొచ్చినయ్యండి. ఆసుపత్రికి పంపి వచ్చాను ఎల్లాగుందోనని దిగులుగాఉంది' అన్నాడు.

ఆఫీసరుకు కాస్త నవ్వొచ్చింది. ఆ కుఱ్ఱవాడి ఆదుర్దానుచూచి. కొద్దిగా జాలిపడ్డాడు. అయితే ఈ మాత్రానికి మెత్తపడి ఆ కుఱ్ఱవాడికి సెలవు ఇస్తే రేపటినుంచి అందరి పెళ్ళాలూ చటుక్కున గర్భిణిలు అవుతారు. రోజుకు ఒకను మా ఆవిడకు నొప్పులొచ్చినయి అంటూ సిద్ధం అవుతారు. అందుకని ఈ మాత్రానికి సెలవు ఇయ్యకూడదను. ఈ నిశ్చయానికి వచ్చి ఆఫీసరు అన్నాడూ, 'మిస్టర్ ప్రసాదు, నీపెళ్లాము నీళ్ళాడుతూఉంటే నీ వెందుకయ్యా, అక్కడ? నీవు చేయ వలసినపని ఏమీఉండదు. ఆసుపత్రిలో చేర్చానంటూఉంటివి. ఇంకా భయం ఎందుకూ? అక్కడ డాక్టర్లూ మంత్రసానులూ ఉంటారు. నీవు వెళ్ళటం అనవసరం' అన్నాడు.

మామూలు కేసుఅయితే ఆదుర్దా ఉండనక్కరలేదు కాని, మా ఆవిడ జబ్బు మనిషండి, అందుకనే.'

"ఏం జబ్బు?"

"గుండె జబ్బు అని డాక్టరు చెప్పాడు! ఆ చెంబెడునీళ్ళా పోసికొని కోడలు మళ్ళీ జనంలో పడితే కొబ్బరికాయలు కొడతానని మా అమ్మ దేవుడికి మొక్కుకున్నదికూడాను."

"ఇంకేం."

"అందుకనే నాకు భయంగా ఉంది. సెలవు ఇస్తే వెళ్ళి చూస్తాను" అన్నాడు ప్రసాదు వినయంగా.

ఆఫీసరుకు ఆ క్షణంలో కాస్తజాలివేసిన మాటనిజము. కాని ఆ కుఱ్ఱవాడికి సెలవు ఇయ్యటంమాత్రం అతనికి ఇష్టం

లేదు. ఇప్పుడు వెళ్ళి అతనక్కడ చేసేది ఏమీలేదు. ఇల్లాగ ఆయన అనుకొన్నాడు.

ఆఫీసరు కొంచెము ఆలోచిస్తున్నట్లు నటించి చివరకు అయితే ఇంకో అరగంట అయిన తరువాత నాకు కనపడు. ఏ సంగతీ చెబుతాను అని చెప్పి ఆ కుఱ్ఱగుమాస్తాను పంపించి వేశాడు.

ప్రసాదు దిగులుగావచ్చి తనకుర్చీలో కూర్చున్నాడు.

* * *

అప్పటికే రెండు అయింది. మూడింటికల్లా టెన్నిస్ మా చెస్ ప్రాంరంభిస్తారు. ఆఫీసరు సెలవు ఇస్తేగదా తాను వెళ్ళటం? ఛీ ఎంత అవస్థవచ్చింది. అరగంట ఎప్పుడు అవు తుందాఅని ప్రసాదు నిమిషాలు లెక్క పెడుతూ కూర్చున్నాడు. ఆ రోజున ఆ అరగంట అవటానికి రెండు గంటలుపట్టింది.

చివరకు ఎట్లాగయితేనేం గోడగడియారం దయదలచి అరగంట కొట్టింది.

కొట్టీకొట్టటంతోనే ప్రసాదు లేచి అఫీసరు గదిలోకి వెళ్ళి ఆయన ఎదటనిలబడ్డాడు.

ఆఫీసరు ప్రసాదువంక వాత్సల్యంతో చూచాడు, పైకిమాత్రం గాంభీర్యాన్ని ప్రకటిస్తూ.

ఆయన ఏమంటాడోనని ప్రసాదు భయపడుతూ దిగు లుగా నుంచున్నాడు.

ఆఫీసరు చిరునవ్వుతో, 'మిస్టర్ ప్రసాదు! నేను ఆసు పత్రికి టెలిఫోన్ చేసి కనుక్కొన్నాను. మీ ఆవిడ కులాసాగా

వుంది. ప్రసాదు ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవిచేసి చూచి మర్యాదకు అనాలిసినమాట, 'థ్యాంక్యూ సర్' అన్నాడు.

ఆఫీసరు మళ్ళీ, 'మీ ఆవిడకు ఏమీ జబ్బులేదనీ, సుఖంగా ప్రసవిస్తుందనీ కూడా డాక్టరు చెప్పాడు.' అని, ప్రసాదువంక ఏదో జవాబును ఆశిస్తున్నవాడిలాగ చూశాడు.

ప్రసాద్ మళ్ళీ, 'థ్యాంక్యూసార్' అని ఊరుకొన్నాడు. అప్రయత్నంగా అతని పెదవులపైకి ఒక చిరునవ్వు దూకింది. తప్పు, ఇప్పుడు నవ్వవలసిన సమయంకాదని చెప్పి, ప్రసాదు ఆ చిరునవ్వును లోపలికి నెట్టివేశాడు.

ఆఫీసరు ముఖంలో కవళికలుమూరినై. నవ్వుపోయి, గాంభీర్యము కమ్ముకొన్నది. కటువుగా అన్నాడు. మీ ఆవిడ సుఖంగా ఉంటే జబ్బు అని ఎందుకు చెప్పావూ?

ప్రసాదు భయపడిపోయి ఏమీ మాట్లాడలేదు.

"అబద్ధమేనా నీవు చెప్పింది?"

ప్రసాదు తలఎత్తలేదు. పెదవి విప్పలేదు. సిగ్గుపడి పోయినాడు.

'ఊఁ, నిజంచెప్పు, అబద్ధం అడావాలేదా?' ఉరిమి చూశాడు అధికారి.

ప్రసాద్ ఆబద్ధాలాడటంలో ఆరితేరిన చెయ్యికాదు. అందుకని తలవంచుకొనే తప్పు ఒప్పుకొన్నాడు "అబద్ధం ఆడానండి."

అయితే ప్రసాదు. నీవూ...భార్యను గురించి అబద్ధం ఆడవచ్చునా?

ఆడకూడదు.

అయితే ఎందుకు అబద్ధ మాడావూ? భార్యను చూద్దామని అంత ప్రాణంపీకిందా?

అదికాదండి...

ఏదికాదోయ్? అదికాకపోతే సెలవు ఎందుకు అడిగావూ? నీ భార్యను చూడ్డానికి కాదూ?

కాదండి.

అయితే ఎవరిభార్యనైనా చూడటానికా?

కాదండి.

మరి ఏం చూద్దామని?

టెన్నిస్ మాచెస్ చూద్దామని?

'ఛీ ఛీ ఛీ ఛీ వెధవ మాచెస్ చూడటానికి సెలవు సంపాదించటానికి, భార్యకు జబ్బుచేసిందంటావు? భార్యను గురించి ఇల్లాంటి అమంగళ వాక్యం అంటానికి నీకు బుద్ధి ఎట్లా పుట్టింది? అందులో గర్భిణిగా ఉన్న ఆమెగదా?

గర్భిణిగా ఉన్నదన్నమాటకూడా అబద్ధమేనండి. ఆఫీసర్ ముఖం వివర్ణమైంది?

అబద్ధం అయితే ఇట్టే పట్టేస్తారు అని అతనికి పేరు, ఉంది. ఇప్పుడు ఏమైంది? అతనే సిగ్గుపడవలసినంత పని జరిగింది.

గర్భిణిగా లేదూ? అయితే ఆసుపత్రికి ఎందుకు పంపావూ?

నేను పంపలేదండి – అసలు నాకు భార్య లేదండి. ఆసుపత్రిలో సుఖంగా ప్రసవిస్తూందన్నారు తమరు...

ఆ వాక్యం పూర్తి చెయ్యలేదు ప్రసాదు.

ఆఫీసరు తేరుకొని విరగబడి నవ్వాడు. నవ్వి ఇట్లా అన్నాడు, మిస్టర్ ప్రసాదు. వెళ్ళు తత్‌క్షణం వెళ్ళు. మా చెస్ రెండురోజులు జరుగుతయ్యి. ఈ రెండు రోజులూ కూడా చూడు. సెలవిచ్చాను. కాని ఒక నెలరోజులు టైము ఇస్తాను. ఈ లోపున నీవు పెళ్ళిచేసుకోవాలె. అబద్ధం ఆడటానికి ఆ మాత్రం ఆధారం లేకపోతే ఎవరికైనా కష్టమే? తెలిసిందా?

ప్రసాదు తెలిసిందన్నట్లు తలఊపి గబగబా వెళ్ళిపోయినాడు మా చెస్ చూడటానికి.

ఆఫీసరు కుర్చీలో జేరిగిలబడి మళ్ళీ ఒకసారి విరగబడి నవ్వుకొన్నాడు.

# సుందరమ్మ అల్లుడు

శర్మ భార్యను రైలు ఎక్కించి ప్లాట్‌ఫారం మీద నుంచుని ఉన్నాడు.

ఆ అమ్మాయి అన్నది "తమ్ముడి అన్నప్రాశన రేపు అయిపోతుంది. నేను అక్కడ అట్టే రోజులు ఉండవలసిన అవసరం ఉండదు. మీరు శనివారం రండి. కలసి మళ్లీ వచ్చేద్దాము.

శర్మ తలఊపి "నేను రావటానికి వీలుండదు. పరీక్షలు దగ్గరకు వచ్చినవి, చదువుకోవాలె" అని కచ్చితంగా చెప్పే శాడు.

ఇట్లా అన్నాడూ అంటే దానికి తగినంత కారణం లేకపోలేదు. ఆ అమ్మాయి శర్మను చాలా విసిగించింది.

క్రొత్తగా కాపరానికి వచ్చిన పిల్లనుగదా అని ఆ అమ్మాయి మొగుడుదగ్గర భయభక్తులతో ఉండటం కాని సిగ్గుగా ఉండడం కాని లేదు. దానికి కారణం ఇంట్లో పెద్ద వాళ్ళు ఎవ్వరూ లేక పోవటమే. అత్తగారు ఉన్నది కాని, ఆవిడ సాధారణంగా ఏ విషయమూ పట్టించుకోదు.

ఆ అబ్బాయి చదువుకొంటూ ఉంటే ఆ అమ్మాయి ఏదో పెద్దపని ఉన్నదానిలాగా వచ్చి, దేనికోసమో అక్కడా ఇక్కడా వెదికి చటుక్కున దీపం ఆర్పేసి "ఇహ పడుకోండి పది అయింది. అట్టే చదవటం వలన ఏమీ ప్రయోజనం లేదు. ఆరోగ్యం చెడిపోవటం తప్ప!" అని విరగబడి నవ్వి పక్కమీద తెల్లదుప్పటి లాగి విదిలించి వేసేది.

దాని తరువాత మళ్ళీ దీపం వెలిగించి చాలా ప్రయత్నం చేసినా కూడా అతని చదువు సాగేదికాదు.

బావమరది వచ్చి వాళ్ళ అక్కయ్యను తీసికొని వెడ తానన్నపుడు శర్మ అనుకొన్నాడు. "ఇది ఒకందుకుమంచిదే. దీన్ని పంపించి నేను నాలుగురోజులు హాయిగా చదువు కోవచ్చు.

అందుకనే ఆ అమ్మాయి "మీరు రెండు రోజులలో రండి ఇద్దరం కలసి వద్దాము." అని అంటే తల గిరగిరా త్రిప్పి 'రాను' అని గట్టిగా చెప్పాడు.

ఆ అమ్మాయి వెళ్ళిపోయిన నాటి రాత్రే శర్మకు కొంచెము కూడా నిద్రపట్టలేదు. పక్కమీద ఉన్న మాసిన దుప్పటిని చూచినప్పుడే ఆ అబ్బాయి ఆలోచనలో పడ్డాడు, దుప్పటితీసి కొత్తదుప్పటి వేయటం ఎల్లాగా అని! కొత్త దుప్పటి ఎక్కడ ఉందో అతనికి ఏం తెలుస్తుంది! తెలుసు కోవటానికి ప్రయత్నం చేసికూడా లాభం ఉండదని అతనికి తెలుసు. అందుకనే అతడు అల్లాంటి ప్రయత్నం ఏమీ చెయ్యక ఆ మాసిన పక్కపైనే పడుకొని నిద్ర పట్టక చాలా అవస్థల పాలైనాడు.

తెల్లవారిన తరువాత అతనికి ఎన్నో విషయాలు చికాకు కలిగించినవి. అన్నానికి రమ్మని ఎవ్వరూ పిలవలేదు. తానే వెళ్ళి తల్లి నడిగి పెట్టించుకొని తిన్నాడు.

ఆ రోజు కఫ్సుగుండీలు పెట్టుకొకుండానే కాలేజీకి వెళ్ళాడు. అవి వేలాడుతూ ఉన్నవి. పైకి మడత వేసినా

నిలువక క్రిందికి జారిపోయినవి. శర్మ ఆ రోజల్లాకూడా చాలా చికాకుగా ఉన్నాడు.

శర్మ సాయంత్రానికి ఇంటికి వచ్చి తల్లి ని పిలిచి అడిగాడు. "పుస్తకాలు అన్నీ దుమ్ముకొట్టుకొన్నాయి. నా కలం కూడా కనపడలేదు. ఎట్లాగమ్మా?" "ఇవన్నీ ఎవరికి తెలుస్తయి నాయనా! కోడలుంటే అది చూస్తుండేది" అని ఆమె నవ్వుకొన్నది.

ఇంటికైన కోడలు లేకపోతే ఎంతకష్టమో అందరికీ తెలిసివచ్చింది. ఒక్కరోజు ఆ అమ్మాయి వెళ్ళిన మరునాటి కల్లా చిన్న చిన్న ఉపద్రవాలు చాలా బయలుదేరినవి. తల్లి పెందలాడేమడికట్టుకొని పూజచేసికొంటూ ఉండటంమూలాన, శర్మ తానే స్వయంగా కాఫీ కాచుకోవలసివచ్చింది. అప్పుడు చెయ్యికూడా కాలింది. అంతేకాకుండా చెయ్యి జారిపడి పోయి టీ కప్పుకూడా పగిలిపోయినది. భోజనము అయిన తరువాత భార్యే చేతిమీద నీళ్ళు పొయ్యాలె. శర్మకు ఆరోజున నీళ్ళు పోసేవాళ్ళు ఎవ్వరూ లేకపోయినారు.

శర్మకు తాంబూలం ఇచ్చేవాళ్ళు ఎవరున్నారు! అతడే పాపం, ఆకులకు సున్నం రాచుకొని వేసుకోవలసి వచ్చింది. ఈ విషయంలో మాత్రం శర్మ చాలా కష్టపడ్డాడు

ఆ సాయంత్రమే చాకలిది బట్టలు తెచ్చింది. లెక్క చూడటం ఎవ్వరికీ తెలియలేదు. తెచ్చిన బట్టలు అక్కడ పెట్టిపోయింది అది! అది ఎన్నిచ్చిందో ఏమో! సగం బట్టలు పారేసినా కనుక్కునే దిక్కు లేదు.

పుస్తకాలన్నీ దుమ్ముకొట్టుకొన్నవి. వాటి ముఖం చూచేవారు లేరు. దువ్వెనా అద్దమూ మొదలైనవి అన్నీ ఇంటావిడ లేదుగదా, మనతో ఎవరికి పని ఉంటుంది అని అనుకొన్నవో ఏమో ఎక్కడివి వక్కడ కనపడకుండా పోయినవి.

ఎంత విచిత్రమైన విషయము ! ఆవిడ ఉన్నప్పుడు ఎక్కడివి అక్కడ వినయ విధేయతలతో పడి ఉండేవి ! ఇప్పుడు అన్నీ అల్లరి చిల్లరగా తిరుగు తున్నవి కాబోలు !

సాయంత్రము అయింది. శర్మ భోజనముచేసి చదువు ప్రారంభించాడు. గంటసేపు అయిన తరువాత చూచుకొంటే ఆరుపంక్తుల ఇతవల ఉన్నాడు. ఎందుచేతనబ్బా చదువు సాగటం లేదు !

శర్మకు ఏమీతోచలేదు. ఆరోజుకు చదువు మానేసి పడుకొని దీనికంతా కారణం ఏమిటో ఆలోచించాలని నిశ్చయించుకొన్నాడు. గాలిదేవుడు దక్షిణానైపు కిటికీతలుపులను మెల్లగా నెట్టి, తొంగిచూచి, ఆవిడ లేకపోయేటప్పటికి మహాజోరుగా వచ్చేశాడు. వచ్చి పక్క అంతా చిందరవందర చేశాడు. శర్మకు చాలా చిన్నతనం అయింది. ఛా ఇదేమిటా, బాగుండ లేదు అనుకొన్నాడు.

అది వెన్నెలరాత్రి కాదు. లోపలా బైటా అంతా చీకటిగా ఉంది. శర్మ అటూ ఇటూ చూచి ఇల్లా అనుకొన్నాడు. 'ఆవిడఉంటే ఇల్లా ఉండేదికాడు.'

ఆరాత్రి నక్షత్రాలు ప్రకాశిస్తున్నాయి. మిధునరాశిలో పెళ్ళాం నక్షత్రం భర్తవేపు చూచి అన్నది. " ఆ కిటికీలో నుంచి చూస్తున్నారా ? ఆపిల్లవాడు పక్కమీద పడి, ఎల్లాగ

శర్మ బి ఏ ప్యాసు అయినాడు తెలుగులోనూ, సంస్కృతంలోనూ. బాగా చదువుకొన్నవాడే కాని ఇటువంటి విషయాలను గురించి చెప్పే పుస్తకాలు అతను చూడలేదు.

తనంతటతాను అత్తవారింటికి పెళ్ళాన్ని పంపించమని అడగటం లోకువ కావటం కాదా అని ఆలోచించాడు.

ఆలోచించి, చివరకు 'ఎబ్బే ఎట్లావెళ్ళేది ఛా వెళ్ళకూడదు' అని అనుకున్నాడు.

ఇంకా ఏమనుకున్నాడూ అంటే 'ఈవిడ రాకపోతే నాకు జరగదా. వండిపెట్టటానికి మా అమ్మ ఉంది. దాసీది నీళ్ళు కాచి ఇస్తుంది. పక్క నేను దులిపివేసుకోలేనా ? ఆమె ఇష్టంవచ్చినన్నిరోజులు పుట్టింట్లో ఉన్నా నాకేమీ భయం లేదు, నేను వెళ్ళను !'

ఈ నిశ్చయం చాలాసేపు నిలువలేదు. దానికి కారణం మనం ఊహించనూ లేము. కాని మొత్తంమీద శర్మ అటూ ఇటూ చాలాసేపు ఊగాడు.

ఆపిల్ల వెళ్ళి రెండురోజులుకాలేదు. ఇంతలో మునిగి పోయినట్లు తాను పరుగెత్తుకుపోతే అంతా నవ్వరూ !

కాని అంతా నవ్వుతారని ఊరుకొంటే బొత్తిగా చదువు సాగటం లేదే ! అది ఎట్లు ?

ఇల్లాగ చాలాసేపు ఊగిఊగి చివరకు అనుకొన్నాడు 'తెల్లవారుఝామున బండికి వెళ్ళి ఆ పిల్లను తీసుకొని వస్తేనే మంచిది' అని !

ఈ నిశ్చయానికి రావటంలో అతడు తొందరపడ్డాడని గాని సిగ్గులేకుండా తెగబడ్డాడనిగాని అంటానికి ఏ మాత్రమూ

వీలులేదు. సిగ్గుపడి వెళ్ళకపోతే పరీక్షలు తప్పిపోవలసిందే కదా! అది మటుకు ఏమంత మంచిపని! అందుకని శర్మ వెళ్ళటానికి నిశ్చయించుకున్నాడు.

శర్మ తెల్లవారు జామున నాలుగుగంటలకే లేచి ముఖం కడుక్కొని మంచిబట్టలు వేసుకొని బయలుదేర బోతూ తల్లిని లేపి అడిగాడు "అమ్మా వెళ్ళి దాన్ని తీసుకు రానా?"

తల్లి లేచివచ్చి "వెళ్ళిరా నాయనా! వెళ్ళకపోతే ఎట్లా! ఆవిడ అక్కడ కూర్చుంటే ఇక్కడ ఎట్లా జరుగు తుందీ?" అన్నది.

శర్మ మెల్లగా లేచి కొత్తకోటు తొడుక్కొని జరీ ఉత్తరీయం వేసుకొన్నాడు. ఈ వెళ్ళటం ఏమంత బాగుంది, పోనీ మానివేశేదామా అనుకొన్నాడు.

అల్లా అనుకొని ఉండనూ లేదు; తెగించి వెళ్ళనూ లేదు. శర్మ ఈ ఆలోచనలో పడ్డ బాధ ఆ భగవంతుడికే తెలియాలె.

ఇల్లాగ మథన పడుతూ ఉండగానే ఒక పెద్ద తమాషా జరిగింది. ఏమిటా అంటే ఎవరో పెద్దకేకవేసినట్టు అతని మనస్సుకు ఈ మాటలు వినపడ్డవి? "ఏమిటా ఊగులాట; వెళ్ళకపోతే ఎట్లా? ఆ అమ్మాయి వెంటనే రాకపోతే నీసంగతి ఎట్లాగు ఉన్నా ముందు మీ అమ్మకు జరగదు. ఆవిడ అన లేదూ, కోడలు అక్కడుంటే ఇక్కడ ఎట్లా జరుగుతుందిరా నాయనా అని!

ఈ మాటలు విన్నట్టు అయ్యేసరికి అతని కళ్ళల్లోకి కొత్తకాంతులు వచ్చినవి అతను కుర్చీలో కూర్చొని ఆలోచిస్తున్నాడు.

పనిగంటకల్లా అక్కడికి చేరుతాడు. భోజనాలైన తరువాత 'దాన్ని తీసుకొని వెడతాను' అని అంటాడు. అంటే ..అప్పుడు వాళ్ళేమంటారు, 'అప్పుడే ఏం తీసికొని వెళ్ళటం నాయనా, వచ్చి రెండురోజులు లేకదా అయింది. ఇంకా నాలుగురోజులు ఉంచుకొని పంపిస్తాములే' అంటారు.

అల్లా అంటే అప్పుడు తనేమి అనాలి?

ఏమండోయ్ మీ అమ్మాయి మీయింట్లో ఎన్ని రోజులున్నా నాకేమీ అభ్యంతరం లేదు. అయితే మా అమ్మ పెద్దది. ఆవిడ అన్నది 'కోడలు అక్కడ ఉంటే ఇక్కడ ఎట్లా జరుగుతుందిరా!' అని. అందుకనే వచ్చాను. లేకపోతే నాకేం!

ఇల్లాగ అనాలని అనుకొంటున్నాడు. ఇంతలో తల్లి వచ్చి, "ఏంరా ఇక్కడే కూర్చున్నావు. ఇంకా రైలుటైము కావటం లేదూ" అన్నది.

శర్మ అన్నాడు, "చదువు పోతుందని ఆలోచిస్తున్నానమ్మా" అని.

ఆ మాటమీద ఆవిడ అన్నది. "ఒక్క పూటలో చదువు ఏమంత పోతుంది. వెళ్ళిరా నాయనా, కోడలు అక్కడుంటే నా కేమీ తోచటం లేదు. అయినా ఎట్లాజరుగుతుంది. వెళ్ళిరా నాయనా."

శర్మ మనస్సు చివుక్కుమన్నది. తను వెళ్ళకపోతే ఆమెగారి మనస్సు కష్టపడుతుంది. ఆ అమ్మాయిని తీసుకొని

రాకపోతే తల్లికి ఒక్కనిమిషం గడవదు. శర్మ తక్షణం లేచి ఉత్తరీయం పైనవేసుకొని వీధిలో కాలు పెట్టాడు. ఇప్పుడు శర్మ తనకోసంకాదు వెళ్ళుతూఉన్నది, తల్లికోసం. ఆ పిల్ల లేకపోతే తల్లికి జరగదు. అందుకనే వెడుతున్నాడు. ఇప్పుడు అతనికి తగినంత కారణం దొరికింది అత్తవారింటికి వెళ్ళటానికి.

అత్తగారింట్లో అందరూ తననుజూచి నవ్వుతారు. పెళ్ళాంకోసం పరుగెత్తుకు వచ్చాడని అనుకొంటారు. కాని ఏంజేస్తాడు! తల్లిమనస్సు కష్టపెట్టడం ఏమంత మంచిపని కాదు. ఇల్లాగ కాసేపు ఆలోచించాడు. చివరకు ఒక నిశ్చయానికి రాగలిగినాడు.

ఎవ్వరేమనుకొన్నాసరే, తల్లి మాట వినాలె!!

అందుకనే అతడు గబగబా గబగబా నడిచి స్టేషనుకు వెళ్ళిపోయినాడు.

శర్మ రైలుదిగి ఎక్కడా ఆగకుండా యకాయకీని అత్తవారింటికే వెళ్లాడు. మధ్య ఎక్కడైనా ముఖం కడుక్కొని కాఫీతాగి మరీ వెడదామా అని అనుకున్నాడు గాని అల్లాగ చేయలేదు ఎందుకో మరి!

ఇంటిముందు బండి ఆగటంతోనే శర్మ మరదలువచ్చి ఇతణ్ణిచూచి పరుగెత్తుకుంటూ లోపలికివెళ్ళి చెప్పేసింది వాళ్ళమ్మతో "అమ్మోయ్ బావ వచ్చాడే" అని. అత్తా మామా వచ్చి శర్మను క్షేమ సమాచారాలు అడిగారు.

అంతా బాగానేఉంది. కాని శర్మ అసలు ఎవరిని చూద్దామని వచ్చాడో ఆమెమాత్రం కనపడలేదు. మేడపైనే ఉందో, క్రిందే ఉన్నదో శర్మ ఊహించలేక పోయినాడు.

"అల్లుడు కాఫీ పుచ్చుకున్నట్లు లేదే, కనుక్కో" అని ముసలాయన భార్యతో అన్నాడు.

శకుంతల శర్మను అడిగింది "ఏం బావా, అసలు ముఖమైనా కడుక్కున్నావా?"

శర్మ లేదని తలతిప్పాడు. బావ విషయమై చూడవలసిన బాధ్యత అంతా ఆ పిల్లపై పడ్డది. ముఖం కడుక్కునేందుకు నీళ్ళు అవీ తెచ్చియిచ్చింది. శర్మ కాఫీతాగుతూ అటూ ఇటూ పిచ్చిచూపులు చూశాడు. కాని కనపడవలసిన వాళ్లు కనపడలేదు.

శర్మకేమీ తోచలేదు. పక్క వీధిలోవున్న హోటలుకు వెళ్ళి ఇడ్డెనలు తినాలని శర్మకు బుద్ధిపుట్టింది. అతనికి ప్రొద్దున్నే రెండు ఇడ్డెనలు తినే అలవాటు ఉన్నమాటకూడా నిజమే.

అతడు పైన ఉత్తరీయం వేసుకొని బైటకు వెళ్ళటానికి తయారుకావటం చూచి ఆ పిల్ల పరుగెత్తుకెళ్లి చెప్పింది వాళ్ళమ్మతో 'బావ ఎక్కడికో వెళ్ళుతున్నా'డని. ఆమె అడిగింది 'ఎక్కడికి నాయనా' అని.

ఇడ్డెనలు తినివస్తానని చెప్పటానికి శర్మకు సిగ్గువేసింది. అందుకని "ఇప్పుడే వస్తాను. ఇక్కడికే, ఒక స్నేహితుడింటికి వెళ్లివస్తాను" అన్నాడు.

"ఇప్పుడేం వెళ్ళటం నాయనా. అన్నంతిని వెడితే నయంకాదూ?" అన్నది ఆవిడ.

శర్మ తలొంచుకొని. "ఇప్పుడే వస్తానండి"అని అంటూ వెళ్ళాడు.

ఆ అబ్బాయి ఇప్పుడు వెళ్ళటం నిజంగా అనవసరం. మామగారు పదిగంటలకల్లా అన్నంతిని ఆఫీసుకు వెడతాడాయె. మామగారితో తను భోజనం చెయ్యాలిసిఉండె! అప్పటికే తొమ్మిది కావస్తున్నది. ఇప్పుడు ఇడ్లీనలు తినక పోతేనేం?

కాని అతనికి ఇడ్లీనలు తినకపోతే మనస్సు సరిగ్గా ఉండదు. ఇడ్లీనలు తినలేదన్న దిగులుతో అతనికి అన్నం కూడా సహించకపోతేపోవచ్చుకూడా! అందుకనే అత్తగారు వద్దు అంటున్నా వినక గబగబా కాఫీ హోటలుకు వెళ్ళి పోయినాడు.

సుందరమ్మగారు భర్త దేవతార్చన చేస్తూ ఉన్న దగ్గరకు వెళ్ళి తలుపుపక్కగా నుంచుని అన్నది "తొందరగా కానీయండి. ఇవ్వాళకూడా ఆలస్యం చేస్తే ఎట్లా?"

ఆయన మంచి ధాస్యంలో ఉండి మాట్లాడలేదు. కాని పదినిమిషాలలో భార్యకు తీర్థం ఇచ్చి "ఇక నా ఆలస్యం లేదు" అన్నాడు.

ఈ లోపున సుందరమ్మగారు నాలుగుసార్లు దొడ్డి గుమ్మంలో నుంచుని చూచింది అల్లుడొస్తున్నాడేమోనని.

శర్మ అయినా ఆలస్యం చేయలేదు నాలుగు ఇడ్లీనలు తిని, మళ్ళీ ఇంకోసారి కాఫీతాగి గబగబా వచ్చేశాడు. తన హృదయేశ్వరి కనుపించలేదుగా, ఆవిడను చూద్దామని ఆదుర్దా ఎక్కువగా ఉంది.

అల్లుడు రావటంలోనే అతణ్ణి స్నానం చెయ్యమని బలవంతపెట్టింది అత్తగారు. 'ఇప్పుడు అన్నం తినండి, ఇంకా

కాసేపు ఉండి తింటాను' అనటానికి శర్మకు సిగ్గువేసింది. ఆమాట అనలేకపోయినాడు. మెదలకుండా స్నానంచేసి భోజనానికి తయారైనాడు.

సుందరమ్మగారు అల్లుడికీ, భర్తకూ వడ్డించింది. శర్మ ఇడ్లీనలు తిని పదినిమిషాలైనా కాలేదు. గొంతులో ఇడ్లీనలు గొంతులోనే ఉండె! పాపం ఏమి తినగలడు!

ఏమీ తినలేకపోయినాడు. రాత్రంతా నిద్రలేకపోవటం మూలాన శర్మ తూలుతూ ఉన్నాడు. బడలికగా నీరసంగా ఉన్నాడు. అందుకని ముఖం చిట్లించి అటునెట్టి ఇటునెట్టి ఒక్క ఆధరవుతోనూ, ఇంత అన్నం తిక లేక పోయినాడు.

శర్మ అత్తగారికి ఎంతో కష్టం వేసింది. అతడు ఎందుకు తినటంలేదో ఆవిడకు తెలియటండాయె. అందుకని "ఏం నాయినా అన్నం సహించటం లేదేమి బాబు?" అని అడిగింది.

అత్తగారు అడిగిన ప్రశ్నకు ఇతడేమీ సమాధానం చెప్పలేదు. ఆడవాళ్ళతో మాట్లాడటానికే సిగ్గు అతనికి!

అదీ కాక....

ఏమని చెబుతాడు! కాఫీ హోటలు కెళ్ళి ఇడ్లీనలుతిని వచ్చానని చెబుతాడా! ఒకవేళ అల్లాగ నిజం చెబుదామన్నా వీలులేకొచ్చె? అసలు అతను కాఫీహోటలుకు కాదుగా వెళ్ళింది. స్నేహితుణ్ణి చూచివచ్చానని చెప్పాడుగా!

అల్లుడు తిండిచూచి ఆమెగారు చాలా గాబరాపడ్డది.

"శరీరం పైత్యాన పడ్డట్టుంది. కాస్త నిమ్మకాయ ముక్కతోనైనా ఓ ముద్ద తినునాయనా" అన్నది. నిమ్మ

కాయముక్కతో అన్నం సహించలేదు శర్మకు. ఆవిడ వుసిరి కాయ వేసింది. దాంతోనూ సహించలేదు.

"ఏం నాయినా బొత్తిగా అన్నంలోపలికి పోవటంలేదు ఎందుచేత?" అన్నది సుందరమ్మగారు. శర్మ జవాబు చెప్ప లేదు. కాని ఆవిడ మాటమాటికి అల్లాగ అడుగుతూ ఉంటే ప్రతిసారీ మాట్లాడకుండా ఊరుకోవటమూ బాగుండలేదు.

ఈ పరిస్థితులలో శర్మ చాలా తికమకలుపడి చివరకు ఊరికేనే, అనాలోచితంగా అనేశాడు. "వంట్లో ఏమీ కులాసాగా లేదండీ" అని. ముఖం చిట్లించి ఎక్కడో చూస్తూ అన్నాడు ఈ మాటలు. ఇల్లాగ అనటం శర్మ అత్తగారు బాగా గమనించింది.

"ఏం, ఎందుకు బాగుండలేదూ?" అన్నాడు ముసలాయన శాస్త్రి ఆదుర్దాపడుతూ.

శర్మ తనకేం జబ్బుఅని చెప్పతాడు. మాట్లాడక ఊరుకొన్నాడు.

'రాత్రి ప్రయాణబడలిక వలన పైత్యం చేసినట్టుంది' అన్నాడు ఆయన, అల్లుడివిషయమై శాస్త్రి ఆలోచించి.

"పైత్యమేకాదు లెండి, కాస్తపడిసెముకూడా పట్టినట్లుంది. మాట కొంచెం బరువుగా ఉంది. కనబడటం లేదూ!" అన్నది ఆమెగారు.

శర్మ ఈ ఇద్దరి మాటలూవిని ఊరుకోటంతో వాళ్ళు, ఆ అబ్బాయికి వంట్లో ఏమీ కులాసాగా లేనిమాట నిజమే అనుకొన్నారు.

ఆయన అన్నాడప్పుడు, "ఏమే, అయితే అల్లుడుకి ఆ రేగటి పెరుగు వేస్తావా ఏమిటి? అసలే పైత్యంగా ఉంది కదా, అజీర్ణం చేసుకొస్తుందేమో!"

పంక్తిని కూచ్చున్నవాడికి వడ్డించకుండా ఎల్లా ఉంటుంది ఆవిడ. అందులో మీగడపెరుగు అల్లుడికి వేయకపోతే ప్రాణం పీకదూ ఆవిడకు? అందుకని "ఏం ఫరవాలేదు లెద్దురూ" అంటూ శర్మకు మీగడపెరుగు వేసింది ఆవిడ.

అప్పటికి శర్మ కడుపులో పడ్డ ఇడ్డెనలు కొంత వరకు అనుగుదలకు వచ్చినయ్యో, లేకపోతే ఈ మీగడ పెరుగులో జఠరాగ్ని పుట్టించే శక్తి ఏమైనా ఉందో చెప్పలేము కాని జరిగినసంగతి ఏమిటా అంటే ఆ కుఱ్ఱవాడికి ఎక్కడలేని ఆకలీ పుట్టుకొచ్చింది. ఇంకా కాస్త అన్నం పెట్టించుకొని ఆ పెరుగుతో తింటే బాగుండును అని అనిపించింది అతనికి. కాని ఏమిలాభం? ఈ పెరుగు ఇల్లాంటిది అని ఆ అబ్బాయి ఇంతకు పూర్వమే ఊహించవలసినది! ఇందాకటినుంచి మెతుకులు కొరుకుతూ ఇప్పుడు తింటానికి తయారు కావటం పెద్దమనిషి తరహా కాదు. అందుకనే, పాపం, శర్మ విస్తట్లో ఉన్న ఆ రెండు మెతుకులే పెరుగుతో తినేశాడు.

ఇంకా కొంచెం అన్నం పెట్టించుకోమని అత్తగారు బ్రతిమిలాడింది. "ఏమీ ఫరవాలేదునాయినా, ప్రయాణం బడలిక వలన పైత్యించి అన్నం సయించటం లేదుగాని అంతకంటే మరేమీ లేదు. కాస్త పెరుగుతోనైనా రెండు ముద్దలు తిను బాబూ" అని ఆ మెగారు ఎంత ప్రాధేయపడ్డా శర్మ, "అబ్బా, వద్దండీ ఏమీవద్దు. నాకు వంట్లో కులాసాగా

లేదు." అంటూ చెయ్యి అడ్డంపెట్టి, తాను అడ్డంపడి నానా హంగామా చేశాడు.

ఇంతకూ,

శర్మ తెలివితక్కువవాడు.

అదీకాక ఆ పరిస్థితులలో అల్లాగ అనటం తప్పని సరి అయింది.

శర్మ సంగతి ఇల్లాగ ఉన్నదా, అక్కడ సుందరమ్మ గారికి ఆందోళన ఎక్కువ అయింది. "పెరుగుతోనైనా కాస్త అన్నం తినలేదమ్మా! వంట్లో పులకరం ఏదో తగిలిఉంటుంది!" అని ఆమె గోలపెట్టింది.

శకుంతల గదిలో మంచం వేసింది బావకు. అత్తగారు వద్దు అంటున్నా వినక శర్మ హాయిగా నిద్రపోయినాడు.

౨

అతడు మళ్ళీ మేల్కొనేసరికి బాగా మబ్బు పట్టి ఉన్నది. కొద్దిగా చలిగాలికూడా వీస్తున్నది.

అతడు నిద్రలేవటంతోనే మరదలువచ్చి అడిగింది 'బావా, ఎట్లాగుంది' అని. శర్మకు ఆశ్చర్యం కలిగింది.

అతనికేం జబ్బు నిజానికి!

పాపం అతనికి భాగా ఆకలి అవుతున్నది. ప్రొద్దున ఏమీ తినలేదాయెను. మామూలు రోజులలో అయితే అత్తగారు ఏమైనాచేసి పంపేదేగాని ఇప్పుడెట్లా పంపుతుంది! ప్రొద్దునేమో రెండు మెతుకులు కొరికి పోయినాడాయె. ఒంట్లో పులకరం తగిలిందేమో ఏమికర్మమో. ఫలహారం

కూడా పెళ్ళితే ఇంకా ఏమన్నా ఉందా, అని అనుకొంది ఆ మొగాడు.

అప్పటికి ఆరుగంటలు అయింది. అప్పుడు అతని ముఖం చూస్తేమాత్రం జ్వరం తగిలిన మనిషిలాగే ఉన్నాడు. ఆకలివల్ల ముఖం వడిలిపోయి ఉన్నది, మనిషి కూరాకు అయిపోయినాడు. అల్లుడిముఖం చూచేసరికి సుందరమ్మగారి గుండెలు కొట్టుకొన్నవి. అత్తగారింటికని ఆ అబ్బాయి రావటం ఏమిటి, ఈ వంట్లో కులాసాగా లేకపోవటం ఏమిటి, కర్మ కాకపోతే ! అనుకొన్నది.

శర్మ శకుంతలను అడిగి కాసిని నీళ్ళు తెప్పించుకొని కాళ్ళూ చేతులూ ముఖం కడుక్కొని బట్టలు వేసుకొని ఎక్కడికో వెళ్ళటానికి సిద్ధమైనాడు. ఇదంతా చూచి, ఆ పిల్ల వాళ్ళ అమ్మతో చెప్పింది – 'బావ ఎక్కడికో వెళ్లాలని చూస్తున్నాడే' అని. ఆవిడ ఆదరాబాదరా వచ్చి "ఎక్కడికి నాయనా ప్రయాణం ?" అని అడిగింది.

"అల్లా వెళ్ళివస్తానండి" అన్నాడు శర్మ. అతను అసలు అనుకొన్నది ఏమిటీ అంటే, ఆ వెళ్ళటం వెళ్ళటం కాఫీహోటలుకెళ్ళి కాస్త ఏమైనా తిందామని.

శర్మ అత్తగారు ఈ మాటలువిని ఆదుర్దాగా అన్నది "ఎక్కడికి వెళ్ళుతావు నాయనా, వద్దు, వద్దు, వంట్లో కులాసాగా లేదన్నావా. ఈ ఈదురగాలిలో బైటకి వెళ్ళటం మంచిదికాదు. కాస్త కాఫీ యిస్తాను తాగి ఇంట్లోనే ఉండు" అంటూ బ్రతిమిలాడింది.

ఇప్పుడెట్లా?

శర్మ గట్టిగా మాట్లాడే స్వభావం కలవాడు కాదు. అతనికి తగని సిగ్గు. 'పనిఉందండీ, వెళ్ళివస్తాను' అని గట్టిగా చెప్పకూడదూ! చెప్పలేకపోయినాడు. అదే అతనికి వచ్చిన కర్మం. అందుకనే ఇన్ని తిప్పలు వచ్చినవి.

అదీకాక,

శర్మ భార్య ఒక్కసారి వచ్చి ఉన్నట్లయితే శర్మ తప్పకుండా ఆ అమ్మాయితో చెప్పేవాడు తనకు ఆకలిగా ఉందనో ఏదో అల్లాగ. ఆపిల్ల రానేలేదు.

అప్పుడు కాస్త చినుకుకూడా ప్రారంభం అయింది. ఆ వర్షంలో వెళ్ళలేకనే ఊరుకున్నాడో, అత్తగారు కాఫీతో పాటు ఫలహారంకూడా పంపుతుందని భ్రమపడ్డాడో ఏమో కాని మొత్తంమీద శర్మ ఆగిపోయినాడు.

ఆతరువాత ఓ పావుగంటకు శకుంతల కాఫీ తెచ్చి ఇచ్చింది పుచ్చుకొన్నాడు. కాని ఆకలి తీరిందా ఏమన్నానా? కడుపులో మండిపోతున్నది.

శర్మ తెలివితక్కువవాడు అని ఇంకోసారి అనవలసి వస్తున్నది. తెలివితక్కువవాడు కాకపోతే ఆ శకుంతలనే పిలిచి నాకు ఆకలవుతున్నదే అని మాటమాత్రం ఎందుకు అనలేక పోయినాడు!

సిగ్గు! సిగ్గు! ఎందుకాసిగ్గు!

పోనీ ఎందుకన్నాకానీ, శర్మ అత్తగారు బైటకు పోవద్దూ అంటే పోకుండా ఉండిపోయినాడా. ఆమెగారు తన మాట వినే ఉండిపోయినాడని అనుకొంటే అదీ ఒక మర్యా

దగా ఉండేది. ఆమె అల్లాగ అనుకోలేదు. పాపం వెళ్ళే ఓపిక లేదమ్మా. వెళ్ళగలిగితే ఊరుకుంటాడుటమ్మా. అని ఆమెగారు ముసలమ్మతో అనటం శర్మ స్వయంగా విన్నాడు. ఇంతకూ అతను బైటికి వెళ్ళలేదు. ఆ కాస్త కాఫీ తాగి పడుకున్నాడు.

నీరసంగా ఉండటం మూలానా, ఏమీ తోచక పోవటం మూలాన, చలిగా ఉండటం మూలానా అతడు మళ్ళీ ముసుగు బిగించాడు. వెచ్చని ముసుగులో అతనికి చటుక్కున నిద్ర పట్టింది.

అతను నిద్రపోతూ ఉండంగా అత్తగారు రెండుమూడు సార్లు వచ్చి చూచి దిగులు ముఖంతో వెళ్ళిపోతూ వచ్చింది.

చివరకు శకుంతలను పిల్చి అన్నది, "అమ్మాయ్, బావ మూసిన కన్ను తెరవకుండా పడుకొన్నాడు. కాస్త ఒంటి మీద చెయ్యివేసి చూడమ్మా ఎట్లా గుందో ?"

శకుంతల గబాగబా వెళ్ళి చూచి వచ్చి, "అమ్మోయ్ బావకు బాగా జ్వరం వచ్చిందే. చెయ్యి కాలిపోతున్నది" అని చెప్పింది.

మసుగ్గా ఉన్న సమయంలో పడుకొని నిద్రపోతే ఒళ్ళు వేడిగా ఉండటంలో విపరీతం ఏమీ లేదు. కాని ఆపిల్ల కేం తెలుసు, జర్వం బాగా వచ్చిం దనుకొన్నది.

సుందరమ్మగారు ఇంతకుముందే అనుకొంటూ ఉన్న దాయె పిల్లవాడికి ఏమీ బాగుండ లేదని. అందుకని ఆ పిల్ల చెప్పినమాట నమ్మింది. అల్లుడు స్థితినిజూచి సుందరమ్మగారు

హాడిలిపోయింది. ఆవిడ పూర్వకాలం మనిషి. సంసారం గుట్టు, రోగం రట్టు అనుకొన్నది.

అందుకనే ఆవిడ గబగబా రత్తమ్మగారి ఇంటికి వెళ్ళింది ఆ రోజు మధ్యాహ్నం.

సుందరమ్మను చూడటంతోనే రత్తమ్మ అన్నది 'ఏం వదినా' అల్లుడొచ్చాడటగా ? చెప్పావుకావేం ? ఉంటాడా నాలుగు రోజులు ?

"ఉండడమ్మా మరి ! అమ్మాయికూడా ఇక్కడే ఉందిగా" అన్నది సుందరమ్మ.

ఆమాటమీద రత్తమ్మ ముసిముసి నవ్వులు నవ్వుకొంటూ అన్నది "అయితే వదినా, మా కోడలును, పంపించు పూలజడ వేస్తాను."

సుందరమ్మ ముఖం చిట్లించి, "పూలజడ వేసినట్లే ఉంది ! ఏ పాపిష్టివేళ బయలుదేరాడోగాని తల్లీ, వచ్చిన దగ్గరనుంచి మూసినకన్ను తెరవకుండా పడుకొన్నాడు." అన్నది విచారంగా.

రత్తమ్మ ముఖంలో సంతోషమంతా మాయమైనది. ఆమెకూడా ఆదుర్దాపడుతూ అడిగింది "ఏమమ్మా, ఎందుకు అల్లాగ పడుకొన్నాడూ ? వంట్లో ఏమీ కులాసాగా లేదా ఏమిటి ?"

ప్రొద్దున భోజనం చేసేప్పుడు వంట్లో ఏమీ కులాసాగా లేదండీ అన్నాడమ్మా. సరిగా భోజనం చెయ్యలేదు కూడాను. ఏదో ప్రయాణపు బడలిక కదా అనుకొన్నాను. మాట కొంచెం భారంగానేఉంది. కాని పులకరం తగిలిందని అనుకో

లేదు వదినా. అను కొంటే పెరుగు పోసేదాన్ని కాదు. అదే పొరబాటు అయిపోయింది. ఆపళంగా పోయి పడుకొన్నా డమ్మా ఇంతవరకు లేవలేదు"అన్నది, సుందరమ్మ.

"పెరుగెందుకు పోశావమ్మా. నీకేమన్నా మతి పోయిందా ఏంకర్మం ?"అని కోప్పడ్డది రత్తమ్మగారు.

"ఎంత వదినా, కాస్తవేశానమ్మా. అవతల మీా అన్నయ్యకు వడ్డిస్తూ ఆ అబ్బాయికి వేయకుండా ఎల్లాగ ఊరుకొనేదమ్మా! బాగుంటుందా నీవే చెప్పు? బాగుండటం ఎట్లాగున్నా నా ప్రాణం ఒప్పలేదు వదినా, చెప్పొద్దూ ఉన్నమాంగతి !" అంటూ సుందరమ్మ కాస్త విచారపడ్డది.

రత్తమ్మ బుగ్గలు నొక్కుకుని, "మంచిపని చేశావులే" అని "నిద్రకూడా పోయినాడా?"అని అడిగింది అనుమానిస్తూనే.

సుందరమ్మ "ఆఁ" అని తలఊపింది.

"నిద్రకూడా పోనిచ్చావూ? ఇంకేమమ్మా, జ్వరంరాకేం జేస్తుంది?" అని తప్పు అంతా సుందరమ్మదే అయినట్లు తేల్చింది రత్తమ్మగారు.

సుందరమ్మ కూడా తాను చేసింది ఏమంత మంచిపని కాదని ఇదివరకే అనుకొంటున్నది. అందుకని విచారంతో అన్నది. "ఏం జేసేదమ్మా వదినా 'అప్పటికీ' నిద్రపోవద్దు నాయినా, అని చెప్పాను."

రత్తమ్మ కొంచెం ఆలోచించి ఇల్లా అన్నది "పిల్లను పంపకపోయినావా? దగ్గర కూర్చుని ఏదో మాటాపలుకూ ఆడుతూ ఉండేదిగా ?"

సుందరమ్మ కొంచెము రహస్యంగా చెప్పింది "నే నే పిల్లను దగ్గరకు పోవద్దన్నాను వదినా చెప్పొద్దూ. నాకు భయం వేసింది. చిన్నపిల్లలా! అతనికి కులాసాగా లేకపోయె! ఏమంటావ్?"

రత్తమ్మగారు ఆమాటనిజమేలే అని ఒప్పుకొన్నది.

కాసేపు ఇద్దరూ మాట్లాడకుండా ఊరుకొన్నారు, ఏదో ఆలోచిస్తూ.

చివరకు సుందరమ్మగారే అడిగింది, "ఇప్పు డెట్లాగు వదినా, అతనేమో అట్లాగుండె! మీ అన్నయ్య ఆఫీసునుంచి పేటకు వెడతానన్నారు. రాత్రికి ఏ పదింటికి వచ్చినా వచ్చి నట్లే! డాక్టరుకు కబురుచేద్దామా?"

రత్తమ్మ బాగా ఆలోచించి ఇల్లాగ ధైర్యం చెప్పింది. "ఎందు కమ్మా డాక్టరు ఈ మాత్రానికి! పార్వతమ్మ అక్కయ్యనుకూడా పిలుచుకొని వస్తానుండు. ఆవిడకు చేతి నాడెంకూడా తెలుసు. ఏదో చెబుతుంది—నీవు ఊరికే ఆదుర్దా పడకు."

"దబ్బున రా వదినా, నాకేమీ తోచటంలేదు." అని సుందరమ్మ మరీమరీ చెప్పి వచ్చేసింది.

## 3

అప్పటికి బాగా చీకటి పడ్డది. శర్మ నిద్ర మేల్కొనే సరికి గది అంతా చీకటిగా ఉంది.

"శకుంతలా!" అని పిలిచాడు శర్మ.

'ఆఁ వస్తున్నా బావా' అని జవాబు చెప్పి ఆ తరువాత మరో నిమిషానికి లాంతరు వెలిగించుకొని, "కాస్త కులాసాగా ఉందా? బావా!" అని చాలా ఆదుర్దాగా అడిగింది, ఆ పిల్ల.

"నాకు కులాసాగా లేకేమీ! అట్లా అడుగుతా వెందుకే శకుంతలా," అన్నాడు శర్మ నవ్వుతూ.

ఆపిల్ల ఏమీ జవాబు చెప్పకుండా చాలా తొందరగా వెళ్ళిపోవటానికి ప్రయత్నం చేసింది.

శర్మ అప్పుడొక తమాషాచేశాడు. చటుక్కున ఆపిల్ల చెయ్యిపట్టుకొని ఆపాడు!

అమ్మయ్య, శర్మకు కాస్త ధైర్యం వచ్చింది. అతడు ఆమాత్రం ధైర్యం చేస్తాడని ఎవ్వరూ అనుకోలేదు.

అల్లాగ ఆపిల్లను ఆపి "ఏమిటా తొందర! ఎక్కడికి పోవాలె?" అని అడిగాడు.

ఆ ఆమ్మాయి పెనుగులాడుతూ, "వదులు బావా అక్కయ్యకు చెప్పివస్తాను" అన్నది.

"ఏమని చెబుతావే?" అని అడిగాడు శర్మ ఆశ్చర్య పోతూ.

"నీవు కాస్త కులాసాగా వున్నావనీ.....లేచి మంచం మీదే కుర్చున్నావనీ.....ఒళ్ళుమటుకు.....ఇంకా బాగా వెచ్చగా....ఉందనీ" అని వేళ్ళమీద లెఖ్ఖపెడుతూ దీర్ఘాలు తీసింది శకుంతల.

"ఇప్పుడు చెప్పకపోతేనేం?"

"అమ్మో! అది దిగులుపడి కూర్చున్నది."

"అంత దిగులుపడ్డ మనిషి వచ్చి నన్ను చూడలేదేం?"

"ఏమో బావా!" అని ఒక్క వూపుతో విదిలించుకు పోయింది ఆపిల్ల!

ఇంకా చలిగాలి వీస్తున్నది. బలహీనంగా ఉండటం మూలాన శర్మకు వణుకు వచ్చింది.

అప్పుడు శర్మ ఏమిచేశాడూ అంటే, శాలువ కప్పుకొని తలగుడ్డ చుట్టుకొని మంచంమీదనే కూర్చొని గోడకు జేరగిలపడి కూచ్చుని పుస్తకం ఒకటి తెరిచి చూడటం మొదలుపెట్టాడు. ఆ ఆకారం చూచినవాళ్ళు అతనికి చాలా జబ్బుగా ఉందని అనుకోక తప్పదు.

శర్మ పుస్తకం చూస్తున్నాడన్నమాటేగాని అతనిని ఎక్కువగా బాధిస్తున్న సమస్యకు సమాధానం ఆపుస్తకంలో ఎక్కడా కనుపించలేదు. భార్యవచ్చి తనను ఎందుకు పలకరించలేదూ అని ప్రశ్న!

అసలు తాను వచ్చిం దెందుకూ?

ఇన్నాళ్ళకు తాను వచ్చాడుగదా, వచ్చీ రావటంతోనే ఆమె కనపడి పలకరించవద్దూ! పోనీ, తాను వచ్చీ రావటంతోనే కనపడకపోతేమానె' కాసేపు అయిన తరువాత అయినా రాకూడదూ!

సాయంత్రం తాను అత్తగారిమాటవిని ఇంట్లో ఉండిపోయింది ఎందుకూ? అప్పుడైనా ఆవిడగారు వచ్చి పలకరిస్తుందని ఆశతోనేగా! ప్రొద్దుటనుంచి ఇంతవరకు ఒక్కసారి వచ్చి చూచిపోవటానికి వీలు లేకపోయిందా ఆ మహారాణిగారికి.

ఇవీ శర్మను బాధిస్తున్న ప్రశ్నలు.

ఎంతసేపు ఆలోచించినా అతనికి సరియైన సమాధానాలు తోచలేదు. ఇదివరలో తాను మహా ప్రేమగల దానిలాగు ప్రవర్తించింది. నిజానికి ఆ అమ్మాయి చాలా టక్కరి మనిషిలాగా కనపడుతున్నది. ఛీ! ఒకవేళ కనపడ్డా ఆవిడను మాట్లాడించనేకూడదు. అనిగట్టిగా నిశ్చయించుకున్నాడుశర్మ.

శర్మ చాలా ఘోరమైన ప్రతిజ్ఞ చేశాడు. అది నిలబెట్టుకోనేవాడే కాని అతనికి అప్పుడు ఇంకొక్క విషయం జ్ఞాపకం వచ్చింది

ఆ అమ్మాయి తాను రాకపోయినా శకుంతలను పంపిందిగా, తను కులాసాగా ఉన్నదీ లేనిదీ చూచిరమ్మని.

తనపై ప్రేమ లేకపోతే ఎందుకు అల్లాగ ఆదుర్దా పడుతుంది ఆ అమ్మాయి; అటునుంచి ఆ ప్రశ్నలకూ, ఇటు ఈ ప్రశ్నలకూ శర్మ తట్టుకోలేక పోయినాడు.

శర్మ ఏమైనా ఆరితేరినవాడా ఏమన్నానా? ఇరవై ఏండ్ల కుఱ్ఱవాడు!

సరేకానీ...రాత్రి భోజనాలైన తరువాత కనపడక పోతుందా, అప్పుడు ముఖాముఖీనే తేల్చుకుందాము ఈవిషయాలన్నీ, అని అనుకున్నాడు.



శర్మ ఇల్లాగ ఆలోచిస్తున్నాడు. ఈలోపున అవతల గదిలో పార్వతమ్మగారూ రత్తమ్మగారూ ఇంకో ముసలమ్మా, చేరి శర్మకు ఆపూటకు ఏమిమందు పడాలో అని తీవ్రంగా ఆలోచిస్తున్నారు.

'దాన్ని అటుకేసి వెళ్ళవద్దని చెప్తూ దానితరువాత నేమనుకొంటే ఏమిలాభం?' అని ఎవరో అన్నమాటలు శర్మకు వినిపించినవి. ఎవరిని ఉద్దేశించి ఈమాటలు అన్నారో శర్మగ్రహించాడు. మనస్సులో పాపం చాలా కష్టపడ్డాడు.

ఇంతలో ఆడవాళ్ళంతా శర్మ ఉన్న గదిలోకి వచ్చారు.

'ఏం, నాయనా ఎట్లాగుంది?' అని అడిగింది-పార్వతమ్మగారు ఎవరినో రోగిని అడిగినట్లు.

"కులాసాగానే ఉందండి" అన్నాడు శర్మ.

"అన్నం తింటావా?" అని అడిగింది ముసలమ్మగారు.

కడుపులో ఆకలి అవుతూనే ఉంది! తింటా నన్నాడు శర్మ.

"ఇంకేమమ్మా, ఆ అబ్బాయికి కాస్త తేలికగా ఉన్నప్పుడు పస్తుపడుకోబెట్టటం ఎందుకమ్మా." అన్నది పార్వతమ్మ.

శర్మ సంతోషించాడు.

"అయ్యో, అల్లాంటి తెలివితక్కువపని ఏమీ చేయకండబ్బా. ఈ పూట పస్తుపడుకో పెట్టటమే మంచిది." అన్నది ముసలమ్మగారు.

శర్మకు అప్పుడు తెలిసింది వ్యవహారం చాలాదాకా పోయినట్లుందని.

నిజానికి శర్మ లేచి, "నాకేమీ జబ్బులేదు. అన్నం సయించక పోవటానికి కారణం వేరే ఉన్నది. నన్ను చంపక అన్నం పెట్టండి" అని పెద్దగా అనేస్తే సరిపోయేది!

శర్మకు ఆమాత్రం ధైర్యం ఉంటే ఇంకా అనుకో వలసింది ఏముంది! సిగ్గుతో తలవంచుకొని వంగిగా అన్నాడు, 'ఫరవాలేదు లెండి, కులాసాగానే ఉంది' అని.

గట్టిగా చెప్పలేదని శర్మను నిందించటంకూడా న్యాయ మని నాకు తోచటంలేదు. నిజానికి ఏముఖం పెట్టుకొని తన కేమీ జబ్బులేదని గట్టిగా అనగలడు!

ప్రొద్దున పదిగంటలకు తనకు వంట్లో ఏమాత్రం సుఖంగా లేకపోయె!

అన్నం సయించ లేదాయె!

ప్రొద్దస్తమానమూ మూసినకన్ను తెరవకుండా పడుండె!

ఇప్పుడు నాకేమీ జబ్బులేదు కులాసాగా ఉన్నానని గట్టిగా ఎట్లా అనగలడు.

అంటేమటుకు ఎవరు నమ్ముతారు!

పోనీ వంగుతూనో, నసుగుతూనో, శర్మ అన్నాడుగా అన్నం తింటానని! సుందరమ్మగారు అయినా ఆ సంగతి గ్రహించి మెదలకుండా ఊరుకొని అతనిని భోజనానికి లెమ్మన కూడదూ!

ఆమె గారు అందరినీ అడుగుతున్నది, అల్లుడికి అన్నం పెట్టాలా వద్దా అని!

అయితే;

ఆమెది తప్పు అంటానికే వీలులేకుండా ఉంది ఎందుకూ అంటే;

ఇంటాయన ఊళ్ళో లేడాయె!

డాక్టరు వచ్చి చూడ లేదాయె!

అనుభవం గలవాళ్ళు అంతా పిల్లవాడికి అన్నం పెట్ట వద్దని చెపుతూ ఉండిరి! ఆవిడ మటుకు ఏం జేస్తుంది!

అన్నం పెట్టకూడదన్న తీర్మానం గొడవ లేకుండా జరిగితే కాస్త బాగుండేది! ఆ విషయమై చచ్చేటంతటి గొడవజరిగింది. ఆ విషయమై అక్కడున్నవాళ్లు అందరూ అన్నివిధాలా చెప్పారు!

ఆ రాత్రికి కాస్త మిరియాల కషాయం ఇచ్చి పడుకో బెట్టమని ఒకరు అన్నారు.

కాస్త చారు అన్నం పెట్టమని ఇంకొక రన్నారు.

చివరకు ముసలమ్మగారు తెగేసి చెప్పేసింది అన్నం గిన్నం ఏమీ పెట్టవద్దనీ, పెడితే చాలా ప్రమాదం అనీ, దానితరువాత ఏమి అనుకొన్నా ఏమీ లాభంలేదు అనీ!

ఎట్లాగయితేనేం ఆపూటకు శర్మను పస్తుపడుకో బెట్టాలనే నిశ్చయించారు వాళ్ళంతా కలిసి.

ఆపూటకు కాళ్ళు ముడుచుకొని పొట్టలో పెట్టుకొని పడుకొందామని శర్మకూడా అనుకొన్నాడు.

ఇంతలో పార్వతమ్మ, ఆవిడ పుణ్యామా అంటూ ఒక మాట అన్నది. ఆమాట అనబట్టే శర్మ బ్రతికిపోయినాడు.

"కుఱ్ఱవాణ్ణి బొత్తిగా పస్తుపడుకోబెట్టకండి మంచి వేడి పాలల్లో, కాస్త పటిక పంచదార వేసి ఇయ్యండి. భారం తీసేస్తుంది" అన్నది ఆవిడ. ఆ పాలు అయినా వేగిరం ఇస్తే బాగుండునని శర్మ తహతహలాడి పోయినాడు.

ఇంతలో రత్తమ్మగారు వచ్చి ఏది నాయినా పడుకో అన్నది, రెండు వేళ్ళూ ఎత్తిపట్టుకొని.

'నాకు ఏమీ వద్దండీ, కులాసాగానే ఉన్నానండీ', అన్నాడు శర్మ. ఆ అనటం దృఢంగా అనలేదాయె! ఏదో సిగ్గు పడుతూ అన్నాడు.

''చూడు నాయినా ఎందుకైనా మంచిది, భారంగా ఉన్నదా, అంతా తగ్గుతుంది. మా నాయనకదూ ఎంతో సేపు మంటపెట్టదు. కాస్త చిమచిమ లాడుతుంది అంతే." ఇల్లాగ చిన్న పిల్లవాణ్ణి బ్రతిమిలాడినట్లు బ్రతిమిలాడింది ఆమెగారు.

శర్మకు గట్టిగా మాట్లాడేందుకు నోరు లేదుగా! చూస్తుండగానే ఆమె రెండు కళ్ళల్లో చుఱ్ఱుమనిపించి వెళ్ళి పోయింది.



శర్మా! శర్మా!

శర్మను చూస్తే ఎవరికైనా జాలివేస్తుంది! పాపం బిడ్డ గంటసేపు బాధపడ్డాడు. ఆమంటతో.

శకుంతల మాత్రం దగ్గర కూర్చుని 'కళ్ళు తెరు బావా తెరిస్తే మంట పోతుంది' అని చెపుతూ వచ్చింది.

కళ్ళు తెలిపిడిపడ్డ తరువాత శర్మ వేడిపాలు తాగి పడుకున్నాడు. ఆకలితీరక వెంటనే నిద్రపట్టలేదు! మేల్కొనే ఉన్నాడు.

శర్మ చాలా చికాకు పడిపోయినాడు. తనకేమి చేసిందని పస్తు పడుకోబెడుతున్నారు వీళ్ళు!! ప్రొద్దున్న

ఒంట్లో కులాసాగా లేదండీ అని అనటం మూలాన ఇన్ని సంఘటనలు బయలు దేరాలా ?

తన భార్య వచ్చి, ఒక్కసారి కలుసుకొన్నట్లయితే నిజం సంగతి చెప్పేశేవాడు. ఏ ఇబ్బందీ లేకపోయేది ! ఆ అమ్మాయి రాకపోవటమే తనస్థితికి అంతా కారణం !

ఇల్లా అనుకొని శర్మ భార్యమీద చాల కోపం తెచ్చుకున్నాడు. కాని ఆ పిల్ల వచ్చి కళ్ళకు కనపడితే గద నాలుగు చీవాట్లు వేయటానికి !

అసలు ఆమె ఇంతవరకు రాలేదు. రావద్దని కూడా గట్టిగా చెప్పారు వాళ్ళు. ఆ సంగతికూడా జ్ఞాపకం వచ్చింది.

అప్పటికి అంతా పడుకున్నారు. శకుంతలకూడా నిద్ర పోయింది. తన భార్య అంతమూర్ఖంగా రాకుండా ఉంటుందా అని శర్మకు అనుమానం కలిగింది, ఇంతలో ఎవరో వస్తున్నట్లు అలికిడి అయింది ఆ అమ్మాయే వస్తున్నట్లు తెలిసింది.

అల్లా అని తెలిసినప్పుడు నవ్వుతూ ఆ అమ్మాయిని పలకరిస్తే, తనకేమీ జబ్బు లేదని ఆపిల్ల అనుకొంటానికి వీలు అయ్యేది. మళ్ళీ శర్మ ఇక్కడ ఇంకొక తెలివితక్కువపని చేశాడు.

ఆపిల్ల వస్తున్నదని తెలియటంతోనే చటుక్కున అటు తిరిగి పడుకొని ముసుగు బిగించాడు. అతనికి భార్యమీద కోపంగాఉంది. అందుకని అల్లాగ చేశాడు. ముసుగుపెట్టుకొని పడుకొన్నవాణ్ణి చూచి ఆపిల్ల ఏమనుకుంటుంది.

శర్మ పరిణయకోపం పట్టాడన్నమాట ! శాస్త్రం చదువుకొన్న శర్మ ఇంత పిచ్చివాడు అయినాడేమి !

ప్రణయకోపం పట్టవలసింది ఆడవాళ్ళుగాని మొగ వాళ్ళు కాదు కదా! శర్మ చదువుకొన్న చదువంతా ఎందుకూ అక్కరకురాలేదు.

ఆ అమ్మాయి దగ్గరకువచ్చి మీద చెయివేసి లేపితే శర్మ లేవలేదు. తాను కోపం నటిస్తున్నాననుకొంటున్నాడే కాని ఆపిల్ల మరీ హడలిపోతున్నదని ఊహించలేదు.

చివరకు ఎట్లాగయితేనేమి ఎంతో కష్టంమీద కళ్ళు తెరచి చూశాడు.

"ఏ మండీ, ఎట్లాగుంది వంట్లో? బాగా జ్వరం వచ్చిందా! కాస్త జారినట్లుందే?" అన్నది ఆ అమ్మాయి ఎంతో ఆదుర్దాగా!

అప్పుడు శర్మకు నిజంగా మంచి ఆలోచన ఒకటి వచ్చింది.

ఆ అమ్మాయితో నిజం చెప్పేద్దాము అనుకొన్నాడు.

అల్లాగ చెబితే, ఆ అమ్మాయి జాలిపడి అరిసెముక్కో, ఏదో అలాంటిది ఏదైనా తింటానికి పెడుతుందని ఒక ఆశ. లేకపోతే అందరూ నిద్రపోయినారు కాబట్టి, తనను తీసికెళ్ళి పెరుగుపోసి అన్నం పెట్టినా పెట్టవచ్చునని ఇంకో ఆశ.

ఇల్లాగ ఆశపడ్డవాడు జరిగినసంగతి అంతా పూస గుచ్చినట్టు చెబితే సరిపోయేది.

అల్లాగ చెబితే అసహ్యంగా ఉంటుందనుకొన్నాడో, సిగ్గు పడ్డాడో ఏమో? చెప్పక "నాకు చాలా ఆకలిగా ఉండదని మాత్రం గునుపుగా అన్నాడు.

అతను అల్లాగ చెబుతూ ఉంటే ఆ పిల్ల నమ్మదు. అదేం కర్మమో!

'అల్లాగే ఉంటుంది లెండి, దొంగ ఆకలి అది!' అన్నది పైగా.

శర్మ ఈమాటవిని చికాకుతో అన్నాడు. 'నాకు వంట్లో కులాసాగానే ఉందే' అని

ఆ పిల్ల అతనిమాటకు అడ్డొచ్చి 'కలికం పడ్డదిగా, అందుకనే కాస్తకులాసా ఇచ్చింది. ఈపూట ఏమీ తినకుండా పడుకుంటిరా, రేపటికి బాగా తేలిక ఇస్తుంది' అన్నది.

వ్యవహారం ఎదురు తిరుగుతున్నది. అతడు తికమకలై 'నాకు ఆకలేస్తున్నది' అని పెద్దగా అన్నాడు.

జబ్బులో అన్నం పెట్టమని మంకుపట్టు పట్టిన కుఱ్ఱవాణ్ణి చూచి, తల్లి ఎల్లాగ జాలిపడుతుందో అల్లాగ జాలిపడ్డది ఆ అమ్మాయి.

ఆ పిల్ల అతణ్ణిచూచి, బుజ్జగిస్తూ ఇల్లాగ అన్నది. 'ఇప్పుడు ఆకలేమిటండీ, పొద్దుగూకులూ మూసినకన్ను తెరవకపోతిరి, కాస్త జ్వరం జారింది కాబట్టి అల్లాగే అనిపిస్తుంది. పొద్దున ఒక్కముద్ద అయినా తినగలిగారూ!

తనకు జ్వరమా?

ఈమాటమీద శర్మ కొద్దిగా నవ్వుకొన్నాడు. ఆ తరువాత కోపంకూడావచ్చింది. అయినా శాంతంగానే అన్నాడు. 'ప్రొద్దున అన్నం తినకపోవటానికి వేరేకారణం ఉంది' అని.

ఆపిల్ల తల గిరగిరా త్రిప్పి 'నేను నమ్మనులే! నీ మాటలు' అన్నట్లు చూచింది.

శర్మ భార్య చెయ్యి పట్టుకొని లాగి మంచంమీద కూర్చోబెట్టుకొని నవ్వుతూ నిజం చెప్పేద్దామన్న ఆదుర్దాతో అన్నాడు 'చూడూ! అసలు సంగతి ఏమిటీ అంటే, వంట్లో బాగుండలేదని అన్నమాట అబద్ధము.'

ఈ మాటలు అంటూ శర్మ, ఆ అమ్మాయికి తన యందు జాలి కలగాలనికామాలు ఆ పిల్ల చిన్నగడ్డాన్ని ముద్దుగా తట్టి బుగ్గలు తాకాడు.

ఆ అమ్మాయికి జాలి కలుగలేదు సరిగదా ఎందుకో కొద్దిగా కోపంకూడా వచ్చింది. మంచంమీద కూర్చున్నదల్లా చటుక్కున లేచి నుంచుని "ఓహోహో జబ్బుగా ఉన్నమాట పగలంతా నిజమున్నూ ప్రొద్దు గూకటంతోనే అబద్ధమూ అయిందేం? చాల్లెండి. ఊరుకోండి. ఆ, మీ వేషాలు నా దగ్గర సాగవు" అని విరగబడి నవ్వి విదిలించుకొని గదితలుపు విసురుగా వేసి వెళ్ళిపోయింది. శర్మ తెల్లబోయి ఊరు కొన్నాడు.

* * * *

శర్మ సంగతి ఏమైంది. మరునాడు ప్రొద్దున అయినా అతనికి అన్నం పెట్టారా, అత్తగారింట్లో ఆ తరువాత ఎన్ని రోజులు ఉన్నాడు? అని ఇల్లాగ బోలెడు సందేహాలు మనకు కలుగతవి.

ఏమో, ఆ విషయం నాకు అంతగా పట్టలేదు.

కాని;

శర్మవంటి తెలివితక్కువవాళ్ళు ఈ ప్రపంచంలో ఎట్లా బ్రతుకుతారా అనిమాత్రం విచారిస్తున్నాను.

# మంగమ్మ అల్లుడు

సుందరమ్మ కాస్త దూరాన ఉండగానే చూచి "రా, వదినా, రా" అని పిలిచింది మంగమ్మ.

సుందరమ్మ ముసిముసి నవ్వులు నవ్వుకొంటూ వచ్చి కూర్చుని "ఏం వదినా, పోట్లాడుకొన్నారటగా కూతురూ, అల్లుడూనూ?" అని అడిగింది.

"అప్పుడే నీదాకా వచ్చిందీ?" అన్నది మంగమ్మ నవ్వుతూ.

నేను వినకూడదా ఏమిటి వదినా?" అన్నది సుందరమ్మ కాస్త కోపం తెచ్చుకొని!

క్షమాపణ కోరుతున్న కంఠంతో మంగమ్మ అన్నది "అదికాదు వదినా, నీవు వినకూడదని కాదు. ఇందులో తప్పు విషయం ఏముంది కాకపోయినా. అసలు నీకు ఈ విషయం ఎవరు చెప్పారూ అని?"

'నిన్న సాయంత్రం సూరమ్మ అత్తయ్య వచ్చిందటగా మీయింటికి. ఆమెకేమో కాస్తో కూస్తో తెలిసి ఉంటుంది. సూరమ్మ అన్నది, కృష్ణుడూ. సత్యమ్మ మళ్ళీ పోట్లాడు కొన్నారురా అని! పడుచువాళ్ళ పోట్లాటలు వింటానికి ఎవరికైనా సరదాగానే ఉంటుంది. ఏమిటి సంగతి చెబుదూ?' అని అడిగింది సుందరమ్మ.

మంగమ్మ అన్నది, "ఏమో వదినా, ఏం పోట్లాటలో, ఏమి సంగతో నాకేమీ అర్థం కావటంలేదు. చిన్నతనంలో ఉన్నారుకదా, చిలకా గోరంకలలాగ ఉండరాదూ ఇద్ద

రూనూ! ఏదో ఒక విషయమై తగూ వస్తూనే ఉంటుంది వదినా వాళ్ళిద్దరికనీ!" ఇట్లా అని మంగమ్మ ఆశ్చర్యాన్ని ప్రకటించింది.

సుందరమ్మ నవ్వి, "ఏమంత పెద్దపోట్లాటలు కావుగా. సరదాగానే ఉంటవి. చెబుదు, సంగతేమిటో వింటాను, అన్నది.

రెండు మూడుసార్లు బ్రతిమిలాడించుకొన్న తరువాత మంగమ్మ అల్లుడి విషయమై ఇల్లాగ చెప్పింది:

"కృష్ణుడు సంగతి ఏమీ బాగుండలేదు వదినా. తను ఏదో ఆఫీసులో గుమాస్తాకదా, ఆపని ఏదో చూచుకో కూడదూ! ఎప్పుడూ దానికొంగు పట్టుకు తిరక్కపోతే! వంటఇంట్లోకి వెడితే వంటఇంట్లోకి! దొడ్లోకి వెడితే దొడ్లోకి తయారు!" అని మళ్ళీ ఆశ్చర్యాన్ని ప్రకటించింది మంగమ్మ గారు.

ఇక్కడ తమాషా ఏమిటీ అంటే, కృష్ణుడు పెళ్ళాం కొంగుపట్టుకొని వంటఇంట్లోకి వెళ్ళటం బాగానే ఉంది, సుందరమ్మకు. దొడ్లోకి వెళ్ళటమే ఆమెకు విచిత్రంగా ఉంది. "దొడ్లోకికూడా ఎందుకమ్మా?" అని ఆశ్చర్యాన్ని పొందుతూ అడిగింది.

"దొడ్లోకి ఎఱ్ఱగన్నేరుపూలు ఉన్నవి. అవన్నీ కోసి దాని ఒళ్ళో పోస్తాడు! దానికెందుకమ్మా అన్నిపూలు! ఏదో నేనూ చూచీచూడనట్టు ఊరుకొంటాను చెప్పొద్దూ" అంటూ మంగమ్మ తన ఔదార్యాన్ని ప్రకటించింది.

మంగమ్మ ఉదారబుద్ధిని గుర్తించి మెచ్చుకొంటున్నదాని వలె సుందరమ్మ అన్నది, "అవునులే, నీకు ఈగొడవలన్నీ పట్టినయ్యి. నీ వంటేమో! పూజా పునస్కారాలేమో! వాటతోనే సరిపోతుంది నీకు. అది సరేగాని వదినా, అసలు సంగతి ఏమిటో చెబుదూ?"

"చెప్తా వదినా, తొందరపడతావేమి. ఏమైందీ అంటే అల్లుడు ఆఫీసునుంచి అయిదుగంటలకు వచ్చాడు వదినా. వచ్చి, సత్యం సత్యం అని పిలిచాడు. పేరుపెట్టే పిలుస్తాడుగా!"

"ఇప్పుడంతా అంతేగా వదినా!"

"సత్యం, సత్యం అని పిలిస్తే ఈ సత్యభామ చప్పున పలకలేదమ్మా, అదీ వచ్చిన ఖర్మం ఇంతకూ!"

"ఎందుకు పలకలేదూ?"

"ఎట్లా పలుకుతుందమ్మా, తనేమో వాకిట్లో ఉండె! అమ్మాయి ఏమో నాదగ్గర వంటింట్లో కూర్చున్నదాయె! ఆమూల వీధి వాకిలీ, ఈమూల దొడ్డివాకిలీనూ!"

"ఇంకేం, పలకలేదని కోపం వచ్చింది కామాలు!"

"కోపం వచ్చిందమ్మా. అయితే కోపం ఎందుకు రావాలా అంటా! పిల్ల ఎక్కడో లోపల ఉండేమోనని కాస్త బిగ్గరగా పిలిస్తే తన సొమ్మేమిపోయింది వదినా? ఆమాత్రం తెలియక్కరలేదూ ఆ అబ్బాయికైనా! ఏం? చిన్నవాడా చితకవాడా, పాతికేళ్ళు పైకొచ్చినయిగదా! ఇంకోసంగతి వదినా, ఆ పిలవటం అయినా ఎట్లా పిలుస్తాడనుకొన్నావు. ఆ తమాషాకూడా చూడాలిసిందే. సత్యం,

సత్యం అని పిల్లికూనలాగ అంటాడమ్మా! అల్లాగ అంటే దగ్గరున్న వాళ్ళకే వినపడదుకదా, దానికేం వినబడుతుం దమ్మా! వినపడక పలకలేదు. విని పలక్కపోవటం కాదుగా! ఆ సంగతి గ్రహించుకోవద్దూ! గ్రహించుకోక కోపంతో తలుపు ధాం ధాం మని కొట్టాడు, ఇంట్లో వాళ్ళంతా హడిలిపోయే లాగున."

"సత్తెమ్మకు అప్పటికీ వినపడలేదా ఏం ఖర్మం?" అని అడిగింది సుందరమ్మ.

"వినపడ్డదమ్మా. వినపడ్డ వెంటనే పరిగెత్తుకుంటూ వెళ్ళిందమ్మా! బిడ్డ వెళ్ళి నవ్వుతూ 'ఏమండీ ఇందరాళ్ళే వచ్చారే, ఇవ్వాళ!" అంటూ తలుపు తీసిందమ్మా మామూలుగానే! పాపం, దానికేం తెలుసు-అప్పటికే ఆయన కడుపులో ఆలోచనలన్నీ ఉన్నయ్యని!"

"ఏమి ఆలోచనలమ్మా?"

"చెప్తానుండు. అప్పుడు ఏమైంది అనుకొన్నావు వదినా, నీవు చెపితే నమ్మవుగాని, నేను నిజంగా, అట్లా అవుతుందనుకోలేదు. తలుపు వెంటనే తియ్యలేదని కోపం వస్తేమటుకూ, ఎంతసేపు ఉండాలమ్మా ఆకోపం?"

"ఆలూ మొగులమధ్య, కోపం అరనిమిషం. అంతకంటే ఎక్కువ ఉండకూడదు!"

"అట్లాగ అయితే ఇంకా అనుకోవలసిం దేముంది! అయ్యో, అయ్యో, ఏమైంది అనుకున్నావు వదినా, అమ్మాయి తలుపుతీసిందా, అల్లుడు రోజులాగ కాక కొత్త కొత్తగా చూస్తూ, సత్యాన్ని మాట్లాడించనైనా మాట్లాడించ

కుండా తన ఆఫీసు గదిలోకి బుసలు కొట్టుకుంటూ వెళ్ళిపోయి నాడమ్మా !''

కృష్ణుడు అల్లాగ వెళ్ళటం చాలా విచిత్రమైన ప్రవర్తన మటుకూ అవును అన్నట్లు సుందరమ్మ చూచి ఆశ్చర్యస్తబ్ధమైన కంఠంతో అడిగింది. ''ఎందుకు వెళ్ళాడు వదినా అల్లాగూ ?''అని.

మంగమ్మ ఉత్సుకతతో చెప్పింది – ''తలుపు వెంటనే తియ్యలేదనేగా, తనకు కోపం. పోనీ అడగకూడదూ, 'ఏమే సత్యామ్, ఏంజేస్తున్నావు లోపల ? ఎందుకు తలుపు తీయ లేదు' అని అడగకూడదటమ్మా ! అడిగితే చెప్పేదేగా''

స్నేహమార్దవమైన హృదయంతో 'అడగనే లేదా !' అన్నది సుందరమ్మ.

మంగమ్మ కౌతుకంతో చెప్పింది, ''అడగనూ లేదు, పెట్టనూ లేదు వదినా. అయ్యగారు మూతి మూరెడు చేసి కొని, గదిలోకి వెళ్ళి, తలుపు ఠాక్కున వేసికొన్నాడమ్మా!''

ఈ మాటలు విని సుందరమ్మ ముక్కుపై వేలేసుకొని ఆశ్చర్యాన్ని ప్రకటించింది.

మంగమ్మ వ్యథితకంఠంతో చెప్పుకుపోయింది, ''నిజం మాటకు దాని తప్పేముంది చెప్పూ. ఆయన ఆఫీసునుంి వస్తాడు. వచ్చేటప్పటికల్లా కాఫీ, ఫలహారమూ తయా చెయ్యాలనేగా అమ్మాయి తొందరపడుతున్నది. తన ం మధ్యాహ్నంనుంచి అది సతమతం అవుతున్నదని ఆం కేం తెలుసు ! ఏమైందనుకొన్నావు వదినా, సమయానికి ంట్లో సెనగపిండి లేకపోయిందమ్మాయ్ ! లేకపోతే మ్మాయి

ఏంజేసిందనుకొన్నావు వదినా, దాని తెలివితేటలకు చెబు తాను. అప్పటి కప్పుడు అప్పిని బ్రతిమిలాడి, బజారుకు పంపించి, పిండి తెప్పించి బజ్జీలు వండించింది. తనకోసమేగా ఈ అవస్థఅంతా! ఈ సంగతి కాస్త గ్రహింపు ఉండా లంటావా?''

"ఉండొద్దుటమ్మా...ఈ మగవాళ్ళకు ఉండేలక్షణమే అల్లాంటిదిలే. నేను ఎరగనా ఏమిటి! అవతలవాళ్ళు తమ కోసం ఎంత ఇదైపోతున్నారో చూడరమ్మాయ్! మగవాళ్ళకు ఆమాత్రం గ్రహింపు ఉంటే ఇంకా అనుకోవలసిందేముంది? సరేగాని, ఇంతకూ అల్లుడు ఏంజేశాడు చెప్పవూ?''

"ఏంజేశాడా, మా సత్యవతివంక కొఱకొఱా చూచి వెళ్ళిపోయినాడు. సత్యాం ఏమీమాట్లాడలేదు. గదిలోకి వెళ్ళి తలుపు వేసుకున్నాడమ్మా, మాటాలేదూ, పలుకూలేదు.''

సుందరమ్మ మంగమ్మ మాటకు అడ్డొచ్చి "అల్లుడు ఆ తరువాత ఏంజేశాడో చెప్పవమ్మా ఊరికే చంపక," అన్నది విసుగుతో.

"అదికాదు వదినా, కాస్తకూ కూస్తకూ మొగవాడు ఇల్లాగ ముడుచుకుపోతుంటే ఆడది కాపరం చెయ్యటం కష్టము. ఏమంటావు?'' అని అడిగింది మంగమ్మ.

అల్లాంటి మగవాళ్ళతో కాపరం చెయ్యటం చాలా కష్టమనీ ఆ మంగమ్మ కూతురుకాంగా ఓపిగ్గా కాపరం చేస్తున్నదనీ సుందరమ్మ చచ్చినట్లు ఒప్పుకొన్న తరువాత మంగమ్మ మళ్ళీ ఇల్లాగ చెప్పింది:

"ఆయన గారికి కోపం వచ్చిందని దీనికి తెలిసిందే అనుకో, తెలిస్తే మటుకు ఏంజేస్తుంది వదినా? మగవాళ్ళకు కోపం వచ్చినప్పుడు కాసేపు మాట్లాడకుండా ఉంటే అదే పోతుంది అనుకొన్నదమ్మా. అనుకొని ఊరుకొన్నది. ఊరు కోటం తప్పు అయిందమ్మా మళ్ళీ!"

"ఊరుకోక ఏంజెయ్యాలె వదినా. ఓహోహో ఊరు కోటం కూడా తప్పు అయితే ఎట్లాగమ్మా."

"అదేనమ్మా వదినా, ఊరుకోకూడదట. ఏదో ఇంగ్లీ షుతో అనాలెటమ్మా! ఏదో చెప్పింది. నాకు రాదు చచ్చి! క్యాజుక్యాజు అనాలటమ్మా! ఎందుకూ అల్లాగ అనటం! ఎక్కడైనా విన్నామా! ఎప్పుడైనా ఎరుగుదుమా మనము! నలభై ఏండ్లు మొగుడితో కాపరం చేశాను నేను, ఎప్పుడూ అనలేదు వదినా అల్లాంటిమాటలు!" మంగమ్మ వ్యథిత కంఠంతో ఈ సంగతి చెప్పి, కళ్ళనీళ్ళు పెట్టుకొన్నది. సుంద రమ్మ చూపవలసిన సానుభూతి చూపిన తరువాత తృప్తిపడి మళ్ళీ ఇట్లాగ చెప్పింది:

"ఛీ ఛీ, అల్లాంటి మాటలు చేసుకొన్న మొగుడితో అంటారా! ఎవరో అప్రాశ్చ్యాలు అనుకోవలసినమాటలు! ఆ మాట అనాలటమ్మా! ఆ మాట అనలేదని ఆయనగారు మూతి మూరెడు చేసుకొన్నాడు." అని మంగమ్మ కళ్ళనీళ్ళు తుడుచుకొన్నది.

సుందరమ్మ సానుభూతి సూచకమైన ఒక నిట్టూర్పు విడిచి "అయ్యో, అయ్యో, ఇదెక్కడి విడ్డూర్యం. అది సరే

కాని, పోనీ అనలేక పోయిందా ఆమాట కాస్త! అంటే దీని నోటి ముత్యాలేమి రాలిపోతయ్యా?" అన్నది.

"అనలేకపోయిందా అంటే, ఒక టొచ్చింది. పోనీ అనవే అమ్మాయీ, ఆయన ఏది అనమంటే, అదే అను అమ్మా, ఎందుకొచ్చిన తగూలివి, అని నేనూ చెప్పాన మ్మోయ్. వచ్చిన ఖర్మం ఏమిటి అంటే, ఆసమయానికి దానికి ఆమాట జ్ఞాపకమేలేదో, తోచనేలేదో, ఏదో అయింది. ఇంతకూ లేచినవేళ మంచిది కాదనుకో! ఇదమ్మా కారణం, ఇక ఆయన మండిపోయినాడు వదినా, చెపితే నమ్ముతావో నమ్మవో కాని, ఆయన కోసం ఇంతా అంతా కాదు. కొంచి కొక్కా చూశాడు దాన్ని కొఱుక్కు తినేట్టు?"

సుందరమ్మ పరిహాస మార్దవమైన కంఠంతో చిరునవ్వు నవ్వుతూ, "కొఱుక్కు మాన్నాడా, ఎందుకు అనకపోవాలె ఈ భడవా" అన్నది.

వినతి పూర్వకమైన కంఠంతో మంగమ్మ అన్నది. "చెప్పాను గదటమ్మా ఆ సమయానికి తోచలేదని! నీవూ ఆలాగే అయావేం వదినా? కొడుకుని వెనుకేసుకొస్తావు!"

"నీ కూతురు చేసినపని పొరపాటే అని ఒప్పుకోవాలె వదినా" అన్నది సుందరమ్మ.

అనురాగ సూచకమైన నిట్టూర్పు విడిచి మంగమ్మ అన్నది, "పోనీ నీవు అన్నట్టు పొరపాటే అయిందనుకో. ఆమాట అనలేదు తప్పే! అనకపోతే ఎందుకు అనలేదు అని అడగాలా? అడిగితే కారణం చెప్పేదిగా! అడక్కుండానే,

సంగతేమిటో తెలిసికోకుండానే ముకుముకుపోతే ఎల్లాగమ్మా కాపరం చేసేది! ఏమంటావు?"

ఇల్లాగ మంగమ్మ కచ్చితంగా అడిగేసరికి సుందరమ్మ పరమసత్యాన్ని దాచలేక "నిజమే మరి ఎవ్వైనా తప్పుఉంటే, ఎందుకిట్లా చేశావూ అని అడగాలె, దండించాలె, ఆ మాట నిజమే" అని ఒప్పుకొన్నది.

మంగమ్మ మళ్ళీ తనకూతురుకు జరిగిన అన్యాయాన్ని గూర్చి చెప్పింది మనస్సులోని సంతోషాన్ని గాంభీర్యమనే అనకుంఠనంతో సాధ్యమైనంతవరకు కప్పిపుచ్చి 'అడగటం లేదు, పెట్టటం లేదు! అల్లాగ పడకకుర్చీలో పడుకొని ఊరుకున్నాడు. సత్యవతి హడలిపోయింది వదినా. నాతో అన్నదమ్మా బిడ్డ. తలుపు వెంటనే తీయకపోతే ఆయన పాపం వీధివాకిట్లో చాలాసేపు నుంచున్నారు. అప్పుడు నేను ఆమాట అనాలె అమ్మాఅని! అల్లాగ అనాలెనని ఆయన చాలాసార్లు చెప్పాడుకూడా! సమయానికి తోచక అనలేదే అమ్మా అని ఊరికే గిలగిల్లాడిందమ్మా బిడ్డ!'

ఇల్లాగ చెప్పి మంగమ్మ ఒక్కనిమిషం ఊరుకొంది. ఆమె మనస్సులో చాలా బాధపడుతున్నట్లు సుందరమ్మ గ్రహించాలె. ఆమె గ్రహించిందో లేదో తెలిసికొంటానికే ఆమె ఆగింది.

సుందరమ్మ కళ్ళు పెద్దవిచేసి, ఇంత అన్యాయం ఎక్కడా చూడనట్లు ఆశ్చర్యాన్ని ప్రకటించిన తరువాత, మంగమ్మ మళ్ళీ కథ ఎత్తుకున్నది.

"నేను చెప్పేది, ఆయన అల్లాగ ముడుచుకు పోకపోతే ఏమమ్మా! పిల్లగానిదే తప్పు అనుకో. అదేవో అనవలసిన మాట చిన్నసన్యాసి అనకపోతే ఒకటికి నాలుగుసార్లు చెప్పి అనిపించుకోవాలెగాని ఇల్లాగైతే ఎల్లాగు వదినా!"

'ఆమాటా నిజమే. నాలుగుసార్లు చెప్పాలిసింది. చెప్పినా, అనకపోతే 'భడవా, ఎందుకనలేదు ఇన్నిసార్లు చెప్పినా' అని అనవచ్చుగా!"

'అదే మొదలు వదినా, ఇక ఇద్దరికీ మాటలు లేవనుకో. నేనూ అనుకోలేదు వదినా, ఆయన కడుపులో ఇంత ఉద్దేశాలు పెట్టుకొన్నాడని! ఏదో ఒక్కమాటకదా అది అనకపోతే, నాపిల్లను నానాఅల్లరీ చేస్తాడా ?" ఆమె కళ్ళు చెమ్మగిల్లినవి.

సుందరమ్మ కరుణార్ద్రహృదయంతో, "ఏమి అల్లరి చేశాడు వదినా" అని అడిగింది

"అదీ చెపుతాగా వినరాదూ. బజ్జీలు చేశానా, అవి నాలుగు వెండిపళ్ళెంలో పెట్టి 'ఇచ్చిరావే అమ్మాయీ' అన్నాను. అది తీసికెళ్ళి ఇచ్చింది. వెధవది నవ్వు వస్తుంది. ఇస్తే బజ్జీలన్నీ తిన్నాడమ్మోయ్ ! పిల్ల మరికాసిని తీసికెళ్ళి వేస్తే మాటవరసకైనా అక్కర లేదు అనకుండా శుభ్రంగా తిన్నాడు! కాఫీకూడా తాగాడు. అప్పటికైనా కోపం పోవాలంటావా!"

ఈ ప్రశ్నకు సుందరమ్మ చటుక్కున జవాబు చెప్పేసింది, "కాఫీ తాగినతరువాత కూడా కోపం పోవకపోవటం తప్పే !"నని.

"కాఫీ తాగి మంచిబట్టలు వేసుకొని గబగబా నడిచి ఎక్కడికో వెళ్ళిపోయినాడమ్మా. అల్లుడు అల్లాగ వెళ్ళిపోయిన దగ్గరనుంచి పిల్ల ముఖం ఇంతజేసుకొని, కోపంతో రుసరుస లాడుతూ కూర్చున్నది."

"అల్లుడు తిట్టాడా తిమ్మాడా, ఎందుకూ ఈ పిల్లకు కోపం?" అని అడిగింది సుందరమ్మ.

మంగమ్మ మునిగడ్డంపై వేలువేసికొని "దీనికి కోపం ఎందుకూ అంటే, ఆయనేదో అనాలటమ్మా, ఆమాట అన లేదుట! అందుకని దీనికి కోపం వచ్చింది."

సుందరమ్మకు ఏమీ అర్థంకాలేదు. "ఏమి అనాలె వదినా! ఏమీ అనకపోతే నేం?" అని అడిగింది అమాయ కంగా.

"ఏదో అనాలెటె వదినా, నేను ఇప్పుడు నీకు ఏదైనా సాయం చేస్తానా, చేస్తే నీవు ఏదో అనాలటమ్మా. అదేదో అమ్మాయి చెప్పింది. థాంక్ అనాలెటమ్మా. అనక పోతేనేం వదినా ఆమాట! ఆమాట అన లేదని దీనికి పుట్టెడంతకోపము వచ్చిందమ్మా."

"బాగానే ఉంది ఇద్దరూ ఇద్దరే" అని సుందరమ్మ విస్తుపోయింది.

"దీనిదగ్గరా ఉన్నదమ్మా, కాకపోయినా పోనీలేవే, ఊరుకో, అంటే ఊరుకుందా, ఊరికే గుంజుకొన్నది! ఇప్పుడు నీవు వదినా, నాలుగు అప్పడాలు కాస్త వత్తిపెట్టమంటావు! నేను వత్తిపెడతా ననుకో. ఆపళంగా నన్ను పట్టుకొని,

తాంక్, తాంక్ అని నీవు అంటున్నావా ? ఎందుకు వదినా అల్లాగ అనటము, నాకు తెలయక అడుగుతాను."

సుందరమ్మకు మటుకు ఏం తెలుసు, ఎందుకు ఆమాట అనాలో ? అయినా తెలివిగలది కాబట్టి కాస్త ఆలోచించి, అదేదో ఆమాటకాస్త ఆ పిల్లవాడు అనకపోవటం తప్పేనని తన అభిప్రాయాన్ని తెలియ పరిచింది.

ఆ తరువాత మంగమ్మ సుందరమ్మ ఈ విషయమై చాలాసేపు మాట్లాడుకొని ఇద్దరివల్లా తప్పు ఉందని నిర్ణ యించారు.

అప్పుడు మంగమ్మ ఆ సంభాషణ ఇల్లాగ ముగించింది. "ఎవరిని ఏమనీ లాభం లేదమ్మా తలుపు ఆలస్యంగా తీసి నప్పుడు ఇది అనాలిసినమాటలు అనలేదని ఆయనకు కోపం వచ్చింది. ఫలహారం పెట్టినప్పుడు ఆయన అనాలిసిన మాటలు అనలేదని దీనికి కోపం వచ్చింది. ఇల్లాగ పెరిగింది వదినా వ్యవహారం."

ఆ తరువాత మంగమ్మ నిస్పృహతో ఒక నిట్టూర్పు విడిచి "అనాలిసిన మాటలు ఏమైనా ఉంటే ఎప్పటివి అప్పుడు అనేసెయ్యాలే తల్లీ అని నేను నెత్తిని నోరుపెట్టుకొని మొత్తుకొన్నా అది వినకపోయె ! ఎట్లా చచ్చేదమ్మా, నేను ఏంజేసేది !" అని మంగమ్మ ఈ వ్యవహారంలో తనతప్పు ఏమీ లేదని గోలపెట్టింది.

తనతప్పు లేకపోవటమే కాకుండా తన కూతురు తప్పు కూడా ఆటే లేదనే మంగమ్మ ఆంతరంగిక భావము. అందు చేతనే అన్నది చివరకు.

"ఇప్పుడు నేను చెప్పేది ఏమిటీ అంటే అది చిన్న సన్యాసి ఏదో అనలేదు అనేగా తనకు కోపం వచ్చింది. పెద్ద వాడుగదా తను అనాలిసినవి మటుకు తను అన్నాడా ఎందుకు అనలేదూ అంటూ ?"

భార్యా భర్తల ప్రవర్తనలో అల్లుడితప్పే కాస్త ఎక్కువగా ఉన్నదని సుందరమ్మ ఒప్పుకొని చివరకు ఈ తగా యిదా ఏవిధంగా పరిష్కారం అయిందో చెప్పమని కోరింది. అప్పుడు మంగమ్మగారు ఇల్లాగ చెప్పింది.

"అప్పుడేం చేశానావదినా, ఇంతలోకే ప్రొద్దుకూకింది. అమ్మాయికి తలదువ్వి వాలుజడవేసి మల్లెపూలు పెట్టాను. ఆపళంగా నేను వంటఇంట్లోకి వెళ్ళిపోయినానమ్మా.

అమ్మాయి అయినా ఏమీ కోపంగాలేదు. ఆయన వచ్చేసరికి ముఖం ముడుచుకొని ఉంటే వ్యవహారం అంతే చెడుతుంది, నవ్వుతూ కనపడమ్మా అని నేను చెప్పి వెళ్ళి పోయినాను.

దానికైనా కాస్త తెలుసువదినా, మొన్న పండుగకు అల్లుడు తెల్లటి గ్లాస్కోచీర కొన్నాడులే. చాలా బాగుం టుంది. అదే కట్టుకున్నది. కుంకుమరంగు పట్టురెవిక జరీపేటు వేసింది తొడిగింది.

వదినా నిజం చెపుతానూ; అమ్మాయి బంగారు తల్లి లాగా తయారు అయింది. నాతల్లిని చూస్తే కడుపు నిండిం దమ్మా. వెధవది అనుకోకూడదు తల్లీ దృష్టికూడా తగులు తుంది.

"పెళ్ళాన్ని చూచి కోపం అంతా మరిచిపోయినాడా అల్లుడు ?" అని అడిగింది సుందరమ్మ.

అదేనమ్మా, అల్లాగ మరచిపోయే మనిషి అయితే ఇంకా అనుకోవలసిందేముంది, అందరి నోళ్ళలో పడటం ఎందుకొస్తుంది. ఆయనా మరిచిపోలేదు, అదీ మరిచిపోలేదు, రాత్రి ఎనిమిదిగంటలకు వచ్చాడమ్మా అల్లుడు. బైటికి ఏమీ అనకపోబట్టి కోపం పోయిందేమో అనుకొన్నాను వెట్టి బాగులదాన్ని. కడుపులో పెట్టుకొన్నాడు వదినా! పెట్టుకొని మాట్లాడకుండా స్నానంచేశాడు అమ్మాయే స్నానానికి నీళ్ళు ఇచ్చింది. ఇదెంత గడుసుదో చూచావా? పోనీ ఆయన మాట్లాడించకపోతే తానుఅయినా మాట్లాడించ కూడదూ, ఊఁహూ, అదీ మూతి బిగించుకొన్నది. ఆయనా బిగించుకొన్నాడు."

మొగుడూ పెళ్ళాలు ఈ విధంగా మూతులు బిగించుకొని ఒకరితో నొకరు మాట్లాడకుండా ఉండటానికి కారణం వాళ్ళకు కోపాలు పోకపోవటమేనని సుందరమ్మ కనిపెట్టి చెప్పేసింది.

మంగమ్మ ఆ అభిప్రాయంతో ఏకీభవించి అన్నది, 'అదేవదినా నేను చెప్పొచ్చేది. కోపాలుపోందే! రోజూ ఇద్దరూ ఒకపంక్తినే కూచ్చుని భోజనంచేసేవాళ్ళా, ఆరోజు అమ్మాయి ఆవైపుకే రాలేదమ్మా. ఆయన తిన్న తరువాత తింటానన్నది. పోనీ ఆయన అయినా పిలవకూడదూ, ఊఁహూ. ఆయనా పిలవలేదు.'

'ఇద్దరికీ పట్టుదలలు వచ్చినవమ్మా.'

'అదే వదినా, పట్టుదలలు వచ్చినవి. ఒక్కమాట అయినా మాట్లాడకుండా ఆయన తిని వెళ్ళాడు. బంగాళా దుంపలకూర అదీ చేశాను. తినటంలో అలగ లేదమ్మోయ్ అల్లుడు. అదీనయమే, ఆయన తరువాత అమ్మాయితిన్నది. మొగుడు అన్నం తింటూఉంటే అది ఆచాయలకు రాలేదమ్మా! కోపం! చూశావా దానికోపం!'

"కోపం, కోపంలా ఉంచుకోవాలె గాని పంక్తిని కూర్చొని భోజనం చెయ్యక పోవటం ఏమిటి! ఎవ్వరినీ అంటానికి వీలులేదమ్మా ఇద్దరూ ఇద్దరే." అన్నది సుందరమ్మ.

"అదేనమ్మా. ఏమైంది అనుకొన్నావు వదినా, భోజనాలు అయినాక పడుకోటానికి వెళ్ళారమ్మా. వీళ్ళ ఇళ్ళు బంగారంగానూ, తెల్లవార్లూ వీళ్ళు ఎక్కడ పోట్లాడుకొంటారో, ఎవరైనా వింటే నవ్విపోతారని నాకు గుండె గుబుక్ గుబుక్కు అన్నది. చెప్పద్దూ!"

"ఎవరి మంచంమీద వారు పడుకొని గప్‌చిప్‌గా నిద్ర పోయినారా?" అని అడిగింది సుందరమ్మ నవ్వుతూ.

"లేదు వదినా, అట్లా అయినా కొంతనయమే. నిద్ర పోందే! ఒకటే కీచులాట! ప్రొద్దుటినుంచి అణచిపెట్టుకొన్న కోపం అంతా పొంగటం సాగిందమ్మా! నీదే తప్పు అని ఆయన. మీకుమటుకు? అక్క ఇది. ఇదీవరుస! ఎట్లాగమ్మా! అప్పుడు నేను ఏం జేశాననుకొన్నావు. ఈ పిల్ల నిద్రపోదు,

తెల్ల వాళ్లూ ఇల్లాగ మాట్లాడుతూనే ఉంటారని భయంవేసి, చెప్పొద్దూ, తలుపు తట్టానమ్మా! అమ్మాయి తలుపు తీసింది. ఏమిటి కిచులాట నాయనా, అని అల్లుణ్ణే అడిగాను, నాకు తెలిసినట్లు ఉండకూడదుగా వాళ్ళు మొగుడూ పెళ్ళాల సంగతి! ఆయనే సంగతంతా చెప్పాడు. నాయనా, నాయనా నేను చెప్పినట్లు వినమని బ్రతిమిలాడి ఇద్దరినీ కూర్చోమని, ఎవరు అనాలిసిన మాటలు, వాళ్ళు అనండర్రా అని బ్రతిమి లాడి అనిపించేసరికి పది తాంగున కొట్టాకు వదినా. అమ్మాయి క్యాజ్ క్యాజ్ సాక్ అన్నది. ఆయన ఏమన్నా థాంక్ తాంక్ అన్నాడు. దానితో ఇద్దరికీ రాజీ కుదిరింది వదినా

ఆ తరువాత నేను బైటికివచ్చి పడుకొని భజగోవింద కీర్తనలు పాడుకొంటూ ఉంటే ఏదో నవ్వుకోటం వినిపించింది. ఆ పోట్లాటలు ఏమిటో మళ్ళీ ఈ నవ్వులేమిటో. పోనీలే వాళ్ళ ఇష్టం నాకెందుకని నేను మాట్లాడలేదు చెప్పొద్దూ! అదీ సంగతి వదినా! ఇంత వ్యవహారం జరిగిందమ్మా!

సుందరమ్మ "చాలా గ్రంథం జరిగిందే" అని ఆశ్చర్య పడి, వెళ్ళిపోయింది.

# పొత అల్లుడు

"ఏమోయ్, బజారుకు వెడుతున్నాను" అని కేక వేసి నేను బయటికి వెళ్ళటానికి సిద్ధమైనాను.

కాంతం అప్పటికే స్నానంచేసి మంచిబట్ట కట్టుకొని తలలో పూలుపెట్టుకొని తులసిపూజ చేసుకొన్నది.

"ఒక్కనిమిషం ఉండండి. వస్తున్నా" అని కేక వేసింది. ఒక్కనిమిషంలోనే వచ్చింది.

నల్లభై ఏండ్లమనిషి అయితే మటుకేం! దబ్బపండు లాంటిముత్తయిదువు. ముఖాన దమ్మిడీ వెడల్పు కుంకుమబొట్టు, చెంపకు చేరడేసి కళ్ళు. నెరసిన చెంపలు. గులాబీరంగు చీర గట్టుకొని, మబ్బురంగు రవిక తొడుక్కొని ఉంది. ఆరుగురి పిల్లలతల్లి! ఆ మాతృమూర్తినిచూచి నేనొక్కడిని తప్ప, మిగిలిన లోకమంతా చెయ్యెత్తి నమస్కరిస్తుంది.

ఆవిడ వచ్చి అన్నది. "చూడండీ మీరు కూరలు తీసుకొని ఇక్కడున్నట్టు రావాలె. అక్కడ ఎవరితోనో మాట్లాడుతూ కూర్చుంటే కాదు. వింటున్నారా?" అన్నది.

"వింటున్నాను" అని తల ఊపాను.

"ఒక వీసెడు వంకాయలూ, అరవీసెడు బెండ కాయలూ, పచ్చిమెరపకాయలూ, టొమాటోలూ" అని చెప్పుకు పోతున్నది.

"ఇవన్నీ కొంటే ఎంత అవుతుందో ఏమిటో ఏమైనా కొంచెం ఆలోచించావా?"

"ఎంత అయినా కానీయండి, ఏంజేస్తాం!" అన్నది ఆవిడ.

సరేనని కావలసిన డబ్బు జేబులో వేసుకొని గడప దిగబోతూఉంటే, "చూడండి, మీరు వెళ్ళే దార్లోనేగా, వున్నాయ ఇల్లు! ఒక శేరుపాలు పంపమని చెప్పండి" అన్నది.

సరేనని తలఊపి వీధిలో కాలుపెట్టాను. ఆవిడ మళ్ళీ నన్ను లోపలికి పిలిచి "చూడండి, వంకాయకూర అల్లుడు తినడట. అమ్మాయి చెబుతున్నది. క్యాబేజీ ఉంటే తీసుకు రండి."

కూరలు ఎంత ప్రియంగా ఉన్నవో అవన్నీ తేవటం ఎంతకష్టమో ఆమెకేమీ తెలియదు. అల్లుడు వస్తేమటుకు మనతోపాటు తినిపోతాడు అనుకోక ఏమిటో ఈ హడావుడి! అనుకొన్నాను.

ఏం జేస్తాం! అల్లుడొస్తున్నాడు.

జేబులో ఉన్న అయిదు రూపాయల నోటుతీసి ఒక్క సారి దానివంక దీనంగా చూచి ఇది కాస్తా సాయంత్రానికి కనపడదు, అని అనుకొని నడిచి పోతున్నాను.

ఇంతలో రాధాయ పరుగెత్తుకుంటూవచ్చి, రాత్రి కూరకు బంగాళా దుంపలూ, మధ్యాహ్నం పలహారం చేయ టానికి కాస్త సెనగపిండో, మైదాపిండో, తెమ్మన్నదనీ, పంచ దారకూడా తెమ్మన్నదనీ, చెప్పాడు.

ఏంజేస్తాం! అల్లుడొస్తుంటే! గబగబా నడిచి బజారుకు వెళ్ళాను.

## ౨

అరగంటలో నేను ఇంటికి తిరిగి వచ్చేసరికి ఇంట్లో పెద్ద కేకలు వినిపిస్తున్నాయి.

ఆ తల్లి ఆ అమ్మాయిని కోప్పడుతున్నది. 'అదేమిటే, అమ్మాయీ, తలంటి పోసుకోమంటే బెల్లంకొట్టిన రాయి లాగా అల్లాగే కూర్చున్నావేమే! లే!'

రాధాయను కోప్పడుతున్నది – 'ఒరేయ్ వెధవా తొందరగా వెళ్ళమనలేదూ! బావ వచ్చేవేళ అయింది.

వెళ్ళి, ఒకకట్ట తమలపాకులూ, కాసిని లవంగాలూ, ఏలక్కాయలూ, తీసికొని రమ్మని ఎంతసేపు అయిందిరా చెప్పి నీకు!'

నన్ను ఉద్దేశించి విసుక్కుంటున్నది – వెళ్ళిన మనిషి అక్కడే కూర్చున్నారు. ఇంతవరకు కూరలు ఇంటికి రాక పోయె! ఇంటిదగ్గర ఏమి కావలసివస్తుందో, తొందరగా వెళ్ళి దామని తోచవద్దూ ఆ మనిషికి! ఎబ్బే! ఏం మనిషమ్మా! ఎన్నాళ్ళు చెప్పుకొన్నా ఇదే వరస అయిపోయె!'

శాస్త్రితో అంటున్నది – 'ఆ పున్నాయ పాలు తేనే లేదు. వెళ్ళి తీసుకురారా. చెప్పి ఎంతసేపు అయిందిరా నీకు! కదలవేంరా! అబ్బ! చదివావు లేరా! మాలావు చదువూ!'

మళ్ళీ అమ్మాయితో అంటున్నది–'తెమలవే అమ్మా, తెములు! తొందరగా కానిచ్చి, తలదువ్వుకొని తెల్లచీరకట్టుకో. పూలు తెమ్మని చెప్పటం మరచిపోయినానేతల్లీ! నాకు బొత్తిగా మతిపోతున్నది, తెస్తారులే అంటావా! అయ్యో! అయ్యో! మీనాన్నకు అంతమాత్రం తెలిస్తే ఇంకేం! ఫలాదివస్తువ

తెమ్మంటేనే తీసుకురాకు! చెప్పకపోతే గ్రహించటం తెలుసూ! సరేగాని తల్లీ తొందరగా కానీయవే. ఆయన వచ్చిన తరువాత మొదలుపెడతావా సింగారం! బాగానే వుంది!'

చిన్న అమ్మాయితో అంటున్నది – 'ఏమేయ్ నీవు అట్లాగే ఉంటావా? ఎబ్బే. రాక్షసిలాగ. నీవుకూడా స్నానం చేసి కొత్తపరికిణా కట్టుకో.'

తనలో తాను అనుకొంటున్నది – 'నాకూ ఇప్పుడే వచ్చింది ఈ రోగం! నడుము పగలేసుకొని పోతున్నది. కూరలు ఇంకా రాకపోయె! ఆయన ఎప్పటికిరానూ! ఎప్పటికి వంటగానూ! అప్పుడే తొమ్మిది కావస్తుండె! అమ్మాయ్, మీనాన్న వస్తున్నారేమో చూడు. రావటం లేదు కదూ! అంతే! మనిషికి అవసరం తెలియకపోయె!'

పాపతో అంటున్నది – 'పాపా, నీవు అట్లా వీధి మొగ సాలకెళ్ళి చూడూ, మీనాన్న వస్తున్నారేమో!'

ఇల్లాగ తొక్కిస పడుతున్నది!

ఏం జేస్తాం, అల్లుడొస్తుండె!!

# 3

'కూరలు తెచ్చానే' అంటూ నేను ఆమె ఎదుట బడ్డాను.

'మీ ఇల్లు బంగారం కానూ! ఇంత ఆలస్యం చేస్తే ఎల్లాగండీ. సరే ఇప్పటికైనా వచ్చారు!' అంటూ సంచి తీసుకొన్నది.

పున్నాయ పాలు తెచ్చింది!
రాధాయ తమలపాకులు తెచ్చాడు!
అమ్మాయి కొత్తచీర కట్టుకొన్నది!
పాప కొత్తపరికిణా కట్టుకొన్నది.

ఆవిడ ముఖం వికసించింది. హృదయంలో పొంగి పొరలిన ఆనందం ముఖాన్ని అంతా కప్పినది. సంతృప్తి సూచకమైన నిట్టూర్పు విడిచింది ఆవిడ. ఆమె శుభమనస్సు తరళితం కాసాగింది. చంచలమైన ఔత్సుక్యంతో ఆమె అందరిని మెచ్చుకోసాగినది.

'మా తండ్రి మంచివాడమ్మా, ఎప్పటికైనా వీడే కాస్త అన్నంపెట్టేది!' అని రాధాయను మెచ్చుకొన్నది.

పాపను దగ్గరకు తీసికొని. 'నా బంగారు తల్లే' అని ముద్దాడి, 'ఓసేయ్ చూడూ, బావకు ఏమైనా కావలిస్తే నిన్ను పిలుస్తాడు గాని నీవు పెంకెతనం చెయ్యక, బావకు ఏం కావాలో కనుక్కొని నాకు చెబుతూ ఉండు అమ్మా!' అని బుద్ధులు చెప్పింది.

'ఒరే రాధిగా, బావ రావటంతోనే కాళ్ళు కడుక్కొనేందుకు నీళ్ళు నేనే ఇస్తానుగాని నీవు తువ్వాలు తీసుకెళ్ళి ఇయ్యేం!'

ఇల్లాగ అందరికీ అన్నిపనులూ చెప్పింది.

మధురమైన కంఠస్వరంతో పాటలు పాడుతున్నట్లు అంటూ ఉన్న ఈ మాటలన్నీ నేను మంత్రప్రభావంవల్ల స్మృతిహీనుడైన వాడిలాగ విన్నాను.

ఇంతవరకూ ఆమె నాకేమీ పని చెప్పలేదు.

'నేను ఏం చెయ్యాలే?' అని అడిగాను.

ఆమె నవ్వుతూ అన్నది, 'మీరేమీ చెయ్యనక్కరలేదు. ఊరుకొని నామీద కేకలు వెయ్యకుండా ఉంటే అదే పదివేలు,'

ఆపళంగా ఆవిడ వంటఇంట్లోకి వెళ్ళిపోయింది, నేను రైలు స్టేషన్‌కు వెళ్ళాను.



అల్లుడూ నేనూ బండి కట్టించుకొని వస్తున్నాము. ఇల్లు ఇంకా కాస్తదూరంగా ఉన్నది. ఇంతలో పసివాళ్ళు ఇద్దరూ పరుగెత్తుకుంటూ వచ్చారు. నేను బండి ఆపి వాళ్ళిద్దరినీ ఎక్కించుకున్నాను. బండి ఇంటిముందు ఆగటంతోనే వాళ్ళుదిగి లోపలికి పరుగెత్తుకొనిపోయి అమ్మకు చెప్పేశారు బావ వచ్చాడని!

మేము గడపలో కాలుపెట్టకముందే అల్లుడికి అత్తగారు కాళ్ళు కడుక్కునేందుకు నీళ్ళు ఇచ్చి క్షేమసమాచారం అడిగింది.

రాధాయి తువాలా ఇచ్చాడు.

అల్లుడు కుర్చీలో కూర్చున్న తరువాత, నేను కాసేపు ఆ సంగతులూ, ఈ సంగతులూ అతనితో మాట్లాడినాను. పాపా, రాధాయి అతనిదగ్గరకు చేరారు. అతను వాళ్ళను ఏదో మాట్లాడిస్తున్నాడు. నేను అవతల గదిలోకి వెళ్ళాను ఏదో

పరిచూచు కొంటానికి. అల్లుడు వాళ్ళను ఏదో ప్రశ్నలు వేస్తున్నాడు. 'మీ అమ్మ ఏం జేస్తున్నది?' 'మీ అన్నయ్య ఏం జేస్తున్నాడు?' అని అడిగి మాటలమధ్య 'మీ పెద్ద అక్కయ్య ఏం జేస్తున్నది?' అని అడిగాడు. ఆపళంగా వాళ్ళిద్దరూ ఒక్క గంతులో వంటఇంట్లోకి పరుగెత్తికెళ్ళి 'పెద్ద అక్కయ్య ఏం జేస్తున్నదే అమ్మా?' అని అడిగారు. 'ఎందుకు నాయనా' అన్నది ఆవిడ. బావ అడుగుతున్నాడని, ఇద్దరూ పెద్దగా చెప్పేశారు. ఆమె వాళ్ళనోరునొక్కి 'అరవకూడదురా బాబూ! మేడపైన గదిలో ఉన్నదని చెప్పు' అని పంపించింది.

భోజనం చేస్తూ ఉన్నంతసేపూ ఆవిడ అంటూనేఉన్నది. 'అయ్యో, ఇంత మొహమాటం ఏమిటండీ అల్లుడికి, బొత్తిగా తినడేం!' అని.

ఎల్లాగయితేనేం భోజనాలు అయిపోయినవి. 'మేడపైన గదిలో పక్క వేసి ఉంది. పడుకోపో నాయినా కాసేపు. రాత్రి నిద్ర లేనట్లున్నది.' అన్నది. ఆ అబ్బాయి నవ్వుకుంటూ పైకి వెళ్ళిపోయినాడు. తమలపాకులూ వక్కలూ అమ్మాయే తీసికెళ్ళి మొగుడికి ఇచ్చివచ్చింది.

ఆ తరువాత తల్లీకూతురూ కూర్చుని మాట్లాడుకొంటూ, నవ్వుకొంటూ భోజనాలు చేశారు.

కాతం వచ్చి నన్నొకసారి గదిలోకి రమ్మని పిలిచింది. నేను వెళ్ళాను. ఆవిడ నాకు దగ్గరగావచ్చి రహస్యంగాఅన్నది, 'చూడండి, అల్లుడు ఈ రాత్రికి ఉండి తెల్లవారుఝామున రైలుకు వెళ్ళిపోతాడట!'

"రేపు ఆఫీసుకు వెళ్ళాలె కామాలు, సెలవుపెట్టి రాలేదేమో!" అన్నాను.

"సెలవుపెట్టినా ఇవ్వరు టండీ?"

"సరే, ఏం జేస్తాం. పంపుదాము. అమ్మాయి పండగ వెళ్ళిందాకా ఉంటుందిగా?" అన్నాను తృప్తితో.

"అమ్మాయి వుంటుంది లెండి! ఆయనసంగతి!" అన్నది కాతర కంఠంతో.

"ఏంజేస్తాం?" అన్నాను.

"అదికాదండీ, ఆయనకూడా పండగదాకా ఉండి, కొత్తబట్టలు కట్టుకు పోతే నా ప్రాణం సంతోషిస్తుంది.' అన్నది ఆవేదనతో.

క్రొత్తబట్టలూ అనేసరికి నాగుండెల్లో రాయిపడ్డది. ఈ రోజులలో క్రొత్తబట్టలు కొనటమూ అంటే ఇరవై ముప్పది రూపాయలు..అయినా ఖర్చు. పండుగకు ఉంటే ఎట్లాగూ క్రొత్తబట్టలు కొని ఇయ్యక తప్పదు అని ఆలోచించి "సరే అల్లుణ్ణి పండగదాకా ఉండమను" అన్నాను.

కాంతం నాకు మరీ దగ్గరకువచ్చి, పెద్ద రహస్యం చెప్పేపద్ధతిలో అన్నది. "అన్నానండీ! పండుగకు రమ్మని, అన్నాను. నాతో 'సెలవు ఇయ్యరండీ' అన్నాడు. అమ్మాయినికూడా అడగమన్నాను."

"అడిగిందా?"

"అడిగిందట. అడిగితే. పండుగకు ఒక్కరోజే సెలవు. రావటానికి వీలులేదు అన్నాడట?" ఆమె ఈ మాటలు నాకు దీనవదనయై చెప్పింది.

నేను అన్నానూ, "పోనీ, ఇంకో పండుగకు వస్తాడులే, సెలవు లేకపోతే ఎల్లాగ వస్తాడు?"

"అది కాదండీ, అమ్మాయీ అల్లుడూ ఇద్దరూ పండుగకు ఇంట్లోఉండి క్రొత్తబట్టలు కట్టుకొంటేనేగాని నా ప్రాణం సంతోషించదు."

నేను ఏమీ మాట్లాడలేదు.

ఆమె తన ఉద్దేశాన్ని నేను గ్రహించలేదన్న విసుగుతో అన్నది, "ఆ అబ్బాయి రాకపోతే ఎట్లాగండీ!"

ఎట్లాగో నాకూ ఏమీ తోచలేదు. రాకపోతే ఏం చేస్తాం! అనుకొని నేను ఏమీ మాట్లాడక ఊరికే ఆమెవంక చూస్తూ కూర్చున్నాను.

మళ్ళీ ఆవిడే అన్నది, "ఏమంటారూ!"

ఏమనాలె! అసలు ఏదో ఒకటి అనవలసిన అవసరం కూడా నాకేమీ కనపడలేదు. ఆయనగారు పండగకు రాక పోతే ఓపాతిక రూపాయలు ఖర్చు తప్పిపోతుందని నేను అనుకొన్నాను.

కాంతం నాకు దగ్గరగావచ్చి బుజంమీద చెయ్యివేసి, ఆదరంతో అన్నది. "నేను చెప్పేది ఏమిటీ అంటే పండగకు అల్లుడికి ఎట్లాగూ బట్టలు పెట్టవలసే ఉండె,....ఇప్పుడే..."

"ఓహో, మరీబాగుంది ఈ వ్యవహారం! రాకపోయినా బట్టలు ఏర్పాటు చేస్తే అన్ని పండగలకూ పోస్టు ద్వారా పంపవలసి వస్తుంది!" అన్నాను నేను నవ్వుతూ.

"ఏమి మాటండీ అవి! అన్ని పండుగలకు బట్టలు పంపుతారా ఏమిటి! పండుగకు ముందు వచ్చాడు కాబట్టే నే ననటం!"

"అయితే పండుగదాకా ఉండమని అను మర్యాదకు లోపం లేకుండా! ఆయన అంతగా ఉండకపోతే ఏం జేస్తాం, ఊరుకో."

కాంతానికి నాతో శాంతంగా వాదించే ఓపిక పోయింది. "అవ్వ, నన్ను తగలెయ్య. ఊరుకొంటే మర్యాదగా ఉంటుం దంటారా! పండుగకు ముందు వచ్చిన అల్లుడికి బట్టలు పెట్టక పోతె బాగుంటుందా? మీరే చెప్పండీ!" అన్నది!

"నిజమే, ఏమీ బాగుండదు అన్న ఒక్క మాట తప్ప, ఇంకేమన్నా ఆమెకు కోపం వచ్చేలాగున్నది. అయినా నేను, ధైర్యంచేసి అన్నానూ, "అయితే నేను పండుగకు ముందు ఎన్నిసార్లు వచ్చాను మీపుట్టింటికి? నాకు మా అత్తగారు ఇట్లాగే బట్టలు పెట్టారా?"

"పెట్టకపోతే?" అన్నది ఆవిడ ఏదో అసందర్భపు మాటలు మాట్లాడుతున్న వాడిని చూచినట్లు చూస్తూ.

నేను మిథ్యాకోపాన్ని ప్రకటిస్తూ. "అప్పుడూ – ఈ తెలివి ఏమైపోయిందీ అంటా! మీనాన్నతో చెప్పి పెట్టించ లేకపోయినావూ!" అన్నాను గొంతుపెద్దదిచేసి!

కాంతం ముఖం ఇంత చేసుకొని "ఇప్పుడెందుకంటే అడంతా! అయినా ఎప్పటి సంగతి చెప్పండి, అది!" అన్నది జాలిగా!

అయినా నేను ఊరుకోక 'ఇప్పుడు నీ కూతురు విషయం వచ్చేసరికి అన్ని మర్యాదలూ తెలిసొచ్చినయ్యేం!' అన్నాను.

కాంతం ఈ తగాదా ఎట్లాగ పరిష్కరించాలో అని ఒక్క నిమిషంలో ఆలోచించి పరిహాసమార్దవమైన కంఠంతో చిరునవ్వు నవ్వుతూ, 'చూడండి, నా కూతురి విషయంలో అన్ని మర్యాదలూ మీరు జరపండి. మీ కొడుకుకు మళ్ళీ ఇన్ని మర్యాదలూ జరిగేలాగున నేను చూస్తాను' అన్నది.

నేను ఇంకేమీమాట్లాడలేకపోయినాను. సంతోషంతో నే నల్భైరూపాయలుతీసుకొని బజారుకు బయలుదేరాను.

నెల అంతా గడపటానికి అట్టిపెట్టుకొన్న డబ్బు అది! అదికాస్తా ఖర్చు అయిపోతే ఎట్లా గడవాలో ఆ భగవంతుడికే తెలియాలె.

ఏం జేస్తాం!

అల్లుడొచ్చాడాయె మరి!

కట్టుకొన్నబట్ట బొత్తిగా మాసింది. పెట్టెలోనుంచి తీసి ఇంకొకటి ఇయ్యమన్నాను ఆవిడను. ఆవిడ 'ఇదొక్కటే ఉన్నది. కాస్తచినిగినట్లుంది' అంటూ ధోవతి నాచేతికిచ్చింది. చూద్దునుగదా రూపాయి వెడల్పు చినుగు ఒకటి కనపడ్డది.

ఆ చినుగువంక చూస్తూ ఒకనిమిషం నిలబడ్డాను!!

ఆ పాతగుడ్డ నోరు తెరుచుకొని, నా దారిద్ర్యాన్ని ప్రపంచానికి చెబుతానని భయపెట్టింది!

ఏడిసింది. ఈ మాత్రానికి నేను భయపడుతానా! 'నేను క్రొత్తధోవతి కొనుక్కోలేనని నీకేం తెలుసు! ప్రపం

చానికి మటుకు ఏం తెలుసు. నోరుముయ్యి. ఆశే అరవకు' అన్నాను నేను వ్యధిత కంఠంతో.

ప్రపంచమంతా నోరు తెరుచుకొని చూచినా లెక్క చేయ దల్చుకోలేదు నేను. సూదీ దారం తీసుకొని దాని నోరు కుట్టివేయటానికి ప్రారంభించాను.

ఆ చినుగు మాట్లాడింది. ఏమన్నది? 'కొత్త ధోవతి కొనుక్కో' అన్నది దీనంగా చూస్తూ. అంతకంటే ఏమీ అనలేదు అదైనా పాపం!

అయినా నాకు ఎందుకో కోపం వచ్చింది. 'ఛా, నోరు ముయ్యి. కొత్తగా ధోవతి కొనుక్కుంటానికి డబ్బు ఎక్కడిది!' అంటూ దానినోరు గట్టిగా కుట్టేశాను. ఆ ధోవతి కట్టుకొని బజారుకు వెళ్ళాను.

బట్టలకొట్టు వర్తకుడు కూడా 'అల్లుడుగారికి పెట్టేవి కాస్త ఖరీదుగలవి అయి ఉండాలండి, లేకపోతే దర్జాగా ఉండ'దని చెప్పాడు. మన కుటుంబ గౌరవాన్ని కాపాడాలనే సదుద్దేశంతో, వాడు అల్లాగ చెబుతూ ఉంటే నేను ఎల్లాగ కాదనేది! నా ధోవతి చినుగుమాత్రం అతడు చూడకుండా జాగ్రత్తపడ్డాను. అల్లుడికి పెట్టవలసిన బట్టలు మంచివే కొన్నాను. అమ్మాయికి ఎట్లాగూ ఒకచీర కొనాలిసే ఉండె! దానికోసం ఇంకోసారి రావటం ఎందుకూ! ఒక మంచిచీర కూడా ఇయ్యమన్నాను. అంతా యాభైరూపాయల బిల్లు అయింది. నా దగ్గరఉన్న నలభై ఇచ్చి మిలిగిన దానికి పద్దు వ్రాయమంటే వాడి ధర్మాన ఒప్పుకొన్నాడు. నెలకు నూటకి రూపాయిన్నర వడ్డీ అని కూడా వ్రాశాడు. పోనీ ఏంజేస్తాము

సమయానికి అప్పుడొరికింది. అదే సంతోషము. అల్లుడికి బట్టలు పెట్టకపోతే ఎట్లా. సరే ఇంటికి వచ్చాను.

అప్పటికే అయిదు గంటలు అయింది. చీకటిపడ్డ తరువాత కొత్తబట్టలు కట్టుకోకూడదు. అందుకని అప్పుడే అల్లుణ్ణి పిలచి కొత్తబట్టలకు పసుపుపెట్టి ఆయనకిచ్చి కట్టుకోమన్నాము. ఆయన కట్టుకొన్నాడు. అమ్మాయి తలుపు పక్కన నుంచుని చూచి సంతోషించింది. ఆవిడా నేనూకూడా సంతోషించాము.

తెల్లవారుఝామున నాలుగింటికే లేపారు నన్ను. అంతకు ముందు మూడుగంటలకే అమ్మాయిలేచి తల్లిని లేపింది. ఇద్దరూ కలిసి వేడినీళ్ళు కాచారు. అయన ముఖం కడుక్కొని స్నానం చేశాడు. అల్లుడూ, నేనూ, అమ్మాయీ, పిల్లలూ అందరం కాఫీ తాగాము. పరితృప్తిత కాంక్షితమైన కాంతం మనస్సు, సంతోషంతో పొరలింది.

అల్లుడు బండి ఎక్కుతూ ఉంటే అమ్మాయి తల్లితో ఏమిటో-గుసగుసలాడింది. ఆవిడఅన్నది, "ఏమాత్రంవీలున్నా పండుగకు రానాయినా, ఒక్కరోజు ఉండి వెళ్ళవచ్చు."

అమ్మాయి ఏమీ అనలేదు గాని ఆయనవంక ఏదో, దీనంగా చూచింది.

పాప, "బావా, పండగకు తప్పకుండా రావాలె" అన్నది.

పిల్లలు ఇద్దరూ, "తప్పకుండా రా బావా" అని చేతిలో చెయ్యి వేయించుకొన్నారు! వేశాడు కాని ఎట్లావస్తాడు. సెలవ దొరకదాయె! రా నని గట్టిగా అనలేక పోయినాడు.

బండి మలుపు తిరిగిందాకా నుంచుని ఇంట్లోకివచ్చేశాము.

# ౭

అప్పటికి బాగా తెల్లవారింది.

నేను, కాంతంతో అన్నాను "నలభై రూపాయలూ అయిపోయినవి, ఎట్లా గడవటం ?

"ఎట్లాగో గడుస్తుంది లెద్దురూ, బెంగబెట్టు కోకండి" అన్నది ఆవిడ.

బెంగఅంటే బెంగకాదూ, నాకు ఊరికే డబ్బు ఎక్కడ నుంచి అయినా వచ్చి పడుతుంది కనకనా! ఈ వెధవస్కూలు మాస్టరీ పనిలో జీతానికి వృద్ధి అంటూ లేదు. పై సంపాదన అసలే లేదు. నేను నా చిన్నతనంలో గనక తాలూకా ఆఫీసులో ప్రవేశించినట్లయితే ఈపాటికి డిప్యూటీ కలెక్టరు అయి కూర్చునే వాణ్ణి!

"పోనిద్దురూ, ఉన్నదాంతో సంతోషిద్దాము." అన్నది ఆవిడ.

ఆవిడ ఎప్పుడూ ఈమాటే అంటుంది. అందుకని నాకు ఒళ్ళు మండుకొచ్చి అన్నాను. "ఇదిగో! నీకు అల్లాంటి బుద్ధి ఉండబట్టే డిప్యూటీ కలెక్టరుగారి భార్య అయ్యే యోగ్యత నీకు లేకుండా పోయింది. తెలిసిందా ?" అన్నాను.

ఆవిడ ఏమీ మాట్లాడ లేదు. అల్లుడొచ్చాడన్న సంతోషంతో ఆవిడ ఈమాటలు ఏమీ పట్టించుకో[illegible]ను. సంతోషాతిశయంతో ఆమె మనస్సు పురివిప్పి నాట్యం[illegible]ది.

## ౬

పండగ రేపు. ఆ రోజున అందరూ కొత్తబట్టలు కట్టు కోవాలె. పాపకు పరికిణా చొక్కా క్రొత్తవే ఉన్నయి. పిల్లలకుకూడా ఇదివరలో కుట్టించిన వాటిలో ఈ పండుగకు అని అట్టి పెట్టినవి ఉన్నవి. అమ్మాయికి కొనసే కొంటిని. ఎటొచ్చీ ఆవిడకు లేదు.

ఆవిడకు ఒక్కర్తెకూ లేకపోవటం ఏమని బజారుకెళ్ళి, ఆ కొట్లోనే పద్దు వ్రాయించి ఇంకో చీర తెచ్చాను.

పండుగ వచ్చింది. అంతా హడావుడిగా ఉన్నది. ఆవిడ వంట చేస్తున్నది. నేను మొత్తం అయినఖర్చు లెక్కజూస్తు న్నాను. రెండు చీరెలూ నలభై. అల్లుడికి పెట్టినబట్టల ఖరీదు ముప్పైరెండు. కూరలు మొదలైనవాటికి ఓ ఎనిమిది రూపా యలు అయింది. మొత్తము ఎనభై రూపాయలతో పండగ వెళ్ళేలాగున ఉంది.

పదిగంటలైంది. ఆవిడ అందరినీ అన్నానికి లెమ్మని అంటూఉన్నది. ఇంతలో ఇంటిముందు జట్కాఆగింది. పిల్లలు పరిగెత్తుకుంటూవచ్చి సంతోషంతో చెప్పారు బావవచ్చేడని!

"పండగరోజున ఎల్లాగో సెలవు సంపాదించి వచ్చావు నాయనా. చాలా సంతోషం" అని అంటూ ఆవిడ అల్లుడికి స్నానానికి నీళ్ళు తోడించింది అమ్మాయిచేత.

పండుగరోజున అల్లుడొచ్చాడని అంతా సంతోషిం చాము. భోజనాలు అయిపోయినవి.

పక్కమీద నడుం వాల్చాను. నాకో దిగులు పట్టు కొంది. నాలుగు గంటలకు అంతా కొత్తబట్టలు కట్టుకొంటారు గదా, ఆయన సంగతి ఏమిటీ అని !

ఇదివరలో బట్టలు పెట్టాముగదా, అవే తీసి ఈ సమయానికి కట్టుకోమంటే బాగుంటుందా ? అని ఒక ఆలోచన.

ఒకసారి పసుపుపెట్టి కట్టి విడిచిన బట్టలు మళ్ళీ కట్టబెట్టటం ఏమిటీ అని మళ్ళీ ఇంకో ఆలోచన.

ఈ ఆలోచనలతో గుండె దడ ఎక్కువ అయింది.

మళ్ళీ కొత్తబట్టలు కొనుక్కు రావాలిసిందేనా ? మొన్న ఇచ్చాముగదా అని ఊరుకోవలెనా ? అబ్బ! ఏసంగతి తోచలేదు.

పండుగరోజున పిల్లలంతా కొత్తబట్టలు కట్టుకుంటూ ఆయన ఏం చెయ్యాలె ?

ఆరి బాబా ! ఈ సమస్య తేలటం ఎల్లాగు !

పండుగముందు ఒకసారి బట్టలు పెడితే మళ్ళీ అదే పండుగకు, అదేమనిషికి బట్టలు పెట్టకూడదని ధర్మశాస్త్రంలో ఉన్నదని ఎవరైనా చెబితే బాగుండు !

ఇంతలో మా కాంతం వచ్చింది. నన్ను బాధపెడుతున్న సమస్యను గురించి సమగ్రంగా ఆమెకు చెప్పి ఇట్లా అన్నాను. "నేను డబ్బుకు పడుతూ ఉన్న ఇబ్బంది నీకు తెలియనిది కాదుకదా ! మళ్ళీ ఇప్పుడు కొత్తబట్ట లుకొనటం కష్టం మరి ఏమంటావు ?"

ఆవిడకూ ఏమీ తోచలేదు. నేను పడ్డ అవస్థలో ఆవిడా పడ్డది. ఒకక్షణం మౌనంగా ఉన్నది. ఆవిడకు ఏదో ఆలోచన వచ్చినట్లున్నది.

నోటిమీదుగా ఏమీ అనకపోయినా, ఆవిడ అంతర్యంలో ఉన్న విషయం ముఖంలో కనిపించే వ్యంగ్య పూర్వకమయిన నవ్వుతో నాకు స్పష్టమయినది.

నాకు భయం వేసింది.

ఏకోన్ముఖంగా ప్రవహించే నదికి దిక్కు అదిక్కు అన్న జ్ఞానం ఉండదు. అట్లాగే నా మనస్సు మార్గాప మార్గాలను గుర్తించే స్థితిలో లేదు. స్వార్థాన్ని అభిలషించి మంచిచెడ్డలను విస్మరించి నేను అన్నాను, "ఆయనకు కొత్తబట్టలు ఇయ్యలేము కాబట్టి మనం అంతాకూడా కొత్తబట్టలు కట్టుకోవటం మానేద్దామూ" అని!

ఈ పలుకులు ఆవిడ విన్నది మాట్లాడకుండా. ఆవిడ మనస్సు చివుక్కుమన్నది. ఆమె కంఠం చలించింది. కళ్ళు చెమ్మగిల్లినవి.

ఆమె ఇల్లాగ అన్నది, "అదేమిటండీ అల్లా అంటారూ! పుట్టింటికి వచ్చిన పిల్ల నిండుపండుగపూట క్రొత్తచీర కట్టుకోకుండా ఎట్లా ఉంటుందండీ?"

ఆమె కంఠస్వరములో స్వేహాపూర్వకమైన ఆర్ద్రత ఉన్నది. కాని దెబ్బతిన్న మనస్సు పడేబాధ, అందులో సుశిక్షితుడైన గాయకుని గొంతులోని జీరవలె, గుప్తంగా ఉండి గుర్తింపతగినట్లుగానే ఉంది.

నేనూ విచారపడ్డాను. క్షమాపణ కోరుతున్న కంఠ స్వరంతో, "నీవు అంత ఇదాలా వెందుకు కాంతం, నీవు కష్టపడతానని గ్రహించకుండా ఆమాట అన్నాను. పొర పాటే. అయితే ఇంకోపని చేద్దాము" అన్నాను.

"ఏం చేద్దామంటారు!" అని అడిగింది ఆమె, కాతు కంతో. నేను చెప్పదల్చుకొన్నది వెంటనే చెప్పలేక పోయి నాను. 'మరీ' అని, ఆగి కాస్తనవ్వి, ఆమె ప్రసన్నవదన అయిందో లేదో గమనిస్తూ, చివరకు, "చూడూ, మనం ఇదివరలో పెట్టామే; ఆ బట్టలనే తీసి, ఆయనను కట్టుకో మంటే, బాగుంటుం దంటావా?" అన్నాను.

ఆమె తల గిరగిరా త్రిప్పుతుందని నేను భయపడ్డాను గాని ఆమె అల్లాగ చేయక, ఆ గదినంతా ప్రకాశవంతం చేసే లాగున దరహాస వదనయై, "భేషుగ్గా ఉంటుందండి, దానికేం!" అన్నది.

ఆమె అల్లాగ అన్నప్పటికీ, నన్ను ఒక విషయం బాధి స్తునే ఉన్నది అమ్మాయి ఏమనుకొంటుందీ అని! నా సందే హాన్ని గురించి నేను ఆవిడతో చెప్పాను.

"అది ఏమీ అనుకోదు. అయినా కనుక్కొని వస్తాను ఉండండి," అని చెప్పి ఆవిడ పక్కగదిలోకి వెళ్ళింది.

వెళ్ళి ఆవిడ అమ్మాయితో చాలాసేపు మాట్లాడుతూ కూర్చున్నది. నేను నా గదిలోనే దిగులుగా కూర్చున్నాను.

పదినిమిషాలు అయిన తరువాత కాంతం నాగదిలోకి అడుగులో అడుగు వేసుకొంటూ వచ్చి, బిక్కముఖంతో

నాముందు నిలబడి అనురాగ కంఠంలో అన్నది, "మనం పెట్టిన బట్టలు ఆయన తీసుకొని రాలేదటండి! అమ్మాయి ఆయనగారి పెట్టెఅంతా వెతికి చూచి చెప్పింది."

నా ముఖం తెల్లబడిపోయింది. అప్పుడు నా ముఖం చూస్తే ఎవరికైనా జాలివేసేది. కాని కాంతం మటుకు ఏమీ జాలిపడ్డట్లు కనుపించలేదు.

ఆశ్చర్య స్తబ్ధమైన కంఠంతో నేను అప్పుడు అన్నాను, "మరి ఏం చెయ్యాలె ఇప్పుడు!"

ఆమె ఏమీ మాట్లాడలేదు. నా హృదయ గతమైన భావాలను తెలుసుకోందామని ప్రయత్నం చేస్తున్నదా అన్పించింది. ఆ విధంగా చూస్తూ నా ఎదుట నిలబడి ఉన్నది.

న్యాయాధికారి నేరస్థుడికి పదిసంవత్సరాలు కఠినశిక్ష వేశానని చెప్పిన తరువాత వాడు ఏవిధంగా మ్లానముఖంతో దిగాలపడి చూస్తాడో అల్లాగ చూశాను నేనూ ఆమెవంక.

ఇక ఆమె ముఖతః వినవలసిన అగత్యముకూడా లేనట్లు తోచింది. ఇంకెందుకూ ఆమె చిరునవ్వే చెబుతున్నది. "ఏం జేస్తాము. మళ్ళీ కొత్తబట్టలు కొనుక్కొనిరండి తప్పదు." అనే ఉపనిషద్వేదాంతాన్ని బోధిస్తున్నవి ఆమె హాస రేఖలు.

సరేననుకొని మళ్ళీ బజారుకు వెళ్ళి పద్దు వ్రాయించి అల్లుడికి బట్టలు కొనుక్కొని వచ్చాను.

సాయంత్రం నాలుగు గంటలు అయింది! మధ్యాహ్నపు ఫలహారాలు అయిపోయినవి. కాంతం కాళ్ళకు పసుపు

పూసుకొని, ముఖాన వెడల్పైన కుంకుమబొట్టు పెట్టుకొని మెడకు కొద్దిగా గంధం పూసుకొని, కొత్తచీరగట్టుకొని నాగదిలోకి వచ్చింది. ముఖం వంచుకొని, మందహాసం చేస్తూ, నాకు పాదాభివందనంచేసింది. ఆమె ముఖంలో ఋషి, పత్నుల లజ్జామధుర సౌందర్యం భాసించింది.

నేను తృప్తితో ఆమెను నఖశిఖ పర్యంతం నాచూపులతో తాకి చూశాను. నా హృదయం ఆనంద ప్లావితమయింది.

మధుర కంఠంతో అన్నది ఆవిడ "ఈ చీర చాలా బాగుందండీ" అని. నేను చిరునవ్వుతో సమాధానం చెప్పాను "ఈ చీర ఏ మిటి, ఏచీరఅయినా బాగుంటుంది నీకు."

స్నేహమార్దవమైన మధుర కంఠాన్ని సవరించుకొని ఆవిడ, "అల్లుడికి కూడా కొత్తబట్టలు ఇయ్యండి" అన్నది. నేను అల్లుడికి కొత్తబట్టలు కట్టబెట్టాను.

నేను కాంతం వంకచూస్తూ కూర్చున్నాను. ఆమె మధురభావమూర్తియై నా ఎదుట కూర్చున్నది. అప్పుడు ఆమె అప్సరో నవ్య శృంగార మధురాపాంగ. ఆ ఆపాంగాంత కాంతి రేఖా వివృత హృదయగత మధుశోభను, తిలకిస్తూ, ఆ దివ్య మూర్తిని ఆరాధిస్తూ నేను ఎంతసేపు కూర్చున్నానో తెలియదు.

ఇంతలో చిన్నపిల్లలు నలుగురూ క్రొత్తబట్టలు కట్టుకొని, నవ్వులు ఒలకబోస్తూ వచ్చి నాపాదాలు ముట్టుకొని నమస్కరించారు.

నా హృదయం ఆనంద తరంగితమైనది. పెద్దతల్లి రాలేను. "అది ఇంకా క్రొత్తబట్ట కట్టుకోలేదేం?" అన్నాను. ఆమె నవ్వి ఊరుకొన్నది.

ఆ నవ్వు మనోహరంగా ఉంది. ఆ నవ్వు ఆమె ఇల్లాలి తనమును, సౌశీల్యమును వినయాది సద్గుణములను వెల్లడించు నట్టిదై ఉన్నది.

ఆ నవ్వు ఎంత అందంగా ఉంది! నిండి తొణికిసలాడు చెరువులో విచ్చి వికసించిన కలువ పూవుకు ఆ అందము లేదు. నోరంతయూ తెరచి పకపక నవ్విన బొడ్డుమల్లె పువ్వునకూ ఆ అందము లేదు.

ఇంతలో పెద్దతల్లీ అల్లుడూ, ఇద్దరూకూడా క్రొత్త బట్టలు కట్టుకొని, నూతన వధూవరులవలె, సిగ్గుతో ఒయ్యారంగా నడుస్తూ నా గదిలోకివచ్చి, ఒకేసారివంగి నాపాదాలు ముట్టుకొని సమస్కరించారు.

పిల్లలందరూ ఆమె చుట్టూ చేరారు. పసివాళ్ళు ఇద్దరూ తల్లికి ఇరుప్రక్కల చేరి ఆమె ఒడిలో ఒదిగి కూర్చున్నారు. పెద్దపిల్లలు ముగ్గురూ ఆమెను ఆనుకొని నుంచున్నారు. ఆనంద తరంగములు గదిలో నలుదిక్కుల విశ్వత్కాంతుల వలె ప్రవహించినవి. మధువేళా సమస్త శోభాభాసితమైన మావి గున్న వలె కాంతం పిల్లలమధ్య కూర్చున్నది.

ఆమె మహోత్సాహంతో, కృతజ్ఞతా మధురాపాంగయై, అవనత ముఖియై, లజ్జారుణ కపోలయై మూర్తీభ

వించిన ప్రేమదేవతయై అనిర్వచనీయమైన ఆనందంలో ఓల లాడుతున్నది.

అప్పుడు ఆమె, స్వర్గలోక నందనవన సమీపమున మందాకినిలో వికసించిన బంగారు తమ్మిపూవు.

సకల సౌరభోపేతమైన మల్లెపూలమధ్య మిలమిల మెరుస్తూ ఉన్న, నవకోమల పారిజాత ప్రసూనం. అనూహిత మైన స్వర్గసౌఖ్యమును అనుభవించిన పరితృప్తి తరతరాల ఆర్య సీమంతినుల హృదయంలో గుప్తంగా దాచుకొన్న, దాంపత్య జీవిత మధురిమమూ, ఆమె కన్నులలో గోచరిస్తూ ఉన్నవి.

ఋషి పుంగవులు ఏళ్ళతరబడి తలక్రిందుగా తపస్సు చేసినా లభ్యం కాని బ్రహ్మానందాన్ని, గృహస్థ జీవితంలో నాకు ప్రసాదించిన, కాంతాన్ని కృతజ్ఞతతో, చూచి, ప్రసన్నుడనై మనస్సులో ఆమెకు నమస్కరించు కొన్నాను.

ఇట్టి ఆనందాన్ని పొందటానికి గృహస్థు ఎటువంటి త్యాగాన్ని అయినా చేయటానికి సంసిద్ధుడే కదా అనిపించింది.

స్వర్గానికి వెళ్ళినా, ఆ ఆనందములో నూరోవంతు అయినా పొందజాలము అని నాకు ఆ క్షణంలో తోచింది.